# చీకట్లోంచి చీకట్లోకి

వడ్డెర చండీదాస్

'విజయ' అనుబంధ మాలికలో
వెలువడ్డ ఇరవై నాల్గవ నవల

విజయ
80, ధనలక్ష్మి కాలనీ
మద్రాసు-26

విజయ అనుబంధం

'VIJAYA' SUPPLEMENT No: 27
FEBRAUARY 1978
'CHIKATLONCHI CHIKATLOKI'
By VADDERA CHANDI DAS

వెల : చెల్లింపలేనిది.

(ఇది 'విజయ' పత్రికతో పాఠకులకు
యివ్వబడ్డ అమూల్య కానుక)



ప్రింటర్స్ :
విజయా గ్రాఫిక్స్,
3. ఆర్కాట్ రోడ్,
మద్రాసు-600 026.

ఆమె :

కారుణ్య రసస్యందినీ సమిధ. ఆమరణ నిర్బంధ మలిని, మాత్రుకాల; మలిన మందార ధార, జగద్ధార. మూలాధార నయన జ్వాలకు యివతలగా, తన చీకటి కడుపున దాచిన, కాంతి నిస్వనపు నవ్వది—

— 'ఆమె' కి.

# సమర్పణ

"చీకట్లోంచి చీకట్లోకి" అనుభూతిలో జనించి సహజరూపం సంతరించుకొన్న నూతన సాహిత్య ప్రక్రియ. యిందులోని ఐదు కథలూ విదానించి విడివిడిగా నిశితంగా చదివితే ఏ కథ కా కథ ఒక మంచి కథ. ఐదూ కలిపి మన భావవేగంతో సమానంగా స్పందిస్తూ చదివితే ఒక స్త్రీ నిండు జీవితాన్ని ప్రత్యక్షంగా చిత్రించే సజీవ నవల. స్పందనద్వారా ప్రత్యనుభూతి స్థితిచేరి మనోనేత్రాల్తో అయిదు సంఘటనల్నీ ఏకంచేసి అందులో ఐక్యంఅయి దర్శించగలిగితే తన్మయపరిచే ఒక విషాద నాటకం. ఒకే వ్యక్తి భిన్న సంఘటనల్లో వివిధ నామరూపాలు పొందడం- Like stills in a moving picture - దేనికది విడివిడిగా ప్రత్యేక సజీవ సాహిత్య సృష్టి కావడం దీని ప్రత్యేకత నూతనత్వం.

శ్రీ చండీదాస్ సృష్టిమార్గానికి తీసుకున్న యితివృత్తానికి. కథానిక, నవల, నాటకం-మూడింటి అయువుపట్లూ అవసరం. వీటి సంలీనంతో యితివృత్తానికి సాహిత్య రూపం సృష్టించడంలో వీరి ప్రతిభా రహస్యం వుంది.

శ్రీ చండీదాస్ సృష్టి, అనుభూతిలో అంకురిస్తుంది; మేధా జనితం మాత్రమే కాదు. ఇటువంటి సృష్టికి పునాది స్వచ్ఛమైన శంక; వూపిరి. భిన్నతత్వాన్ని సర్వేంద్రియాల్తో సమదృష్టితో దర్శించ గల విజాయితీ; బలం; అనుభూతించిందంతా వొక కొలిక్కిచేరి పక్వంచెంది ఒక రూపం సంతరించుకునేంతవరకూ మెలుకువతో మననం చేయగల నిబ్బరం. ఈ రకమైన సృష్టి. "ఉన్నది-లేదు"

అనే భిన్నత్వాన్ని అధిగమించగల అనాస్తిక దృష్టికే సాధ్యం. ఇందులో శ్రమకాలం యెంత అని చెప్పడం కష్టం.

ఏదయినా - దైవం కూడా- 'వున్నది(డు)' అనే వాదం వుంటేనే 'లేదు(డు)' అనడానికి వీలయింది. 'లేదు(డు)' అనందే 'వున్నది(డు)' అనడానికి ఆస్కారంలేదు. వీటి మీద నిర్మించుకున్న 'ఆస్తిక-నాస్తిక' మార్గాలు రెండూ పరిమితమైనవి, పరస్పర ఆధార మైనవి. దుర్ నమ్మకానికి (Bad Faith) కట్టుబడినవి.

స్వచ్ఛమైన శంక, యీ స్థితిని అధిగమించినది. మనం తొంగి చూడ్డానికి సాహసించని సాహసించలేని సృష్టి రహస్యాల లోతుల్లోకి మనల్ని తీసికెడుతుంది. వ్యక్తి సంఘం మతం నీతి మంచీ చెడూ పుట్టుపూర్వోత్తరాల్ని నిగ్గదీసి చూసే శక్తినిస్తుంది. ఈ శంక, నిజాయితీ, నిబ్బరం, ధైర్యం; చండీదాస్ సృష్టికి భావ గంభీరత, ఆలోచనలో లోతు, దార్శనికత యిస్తాయి. అందుకనే వీరి రచనల్ని చదవడం శ్రమ, అర్థం చేసుకోవడం కష్టం. ప్రణాళికతో ప్రయత్నించి సిద్ధాంత దాస్యంతో చేసిన రచనకాదు గనక పెద్రంగా కనిపిస్తుంది.

'చీకట్లోంచి చీకట్లోకి' యితివృత్తం, జీవి వేదన. మనిషి జీవితం, మొదటి పేజీ చివరిపేజీ చిరిగిపోయిన నవలలాంటిది. జన్మ ముందు జీవి ఏమిటో, మరణాంతరం ఏమవుతుందో తెలియదు. అంటే, జీవితం రెండు చీకట్ల మధ్య వెలుగు. ఈ వెలుగు వుదయించి అస్తమించేవరకు అనేక దశల్లో మారుతుంది. ఒకే వ్యక్తి పసితనంలో, చిన్నతనంలో, యవ్వనంలో, నడివయస్సులో, ముసలితనంలో వొకేపేరుతో పిలవబడినా రూపం, మనుగడ, పాత్రత మారతాయి. పాలు, పెరుగు, మీగడ, వెన్న, నెయ్యి ఎలా పాల పొందే వివిధ రూపాలో, మనిషీ అంతే. ఒకే ప్రవాహంలో రెండు సార్లు దిగలేం. వొకసారి దిగి వొడ్డెక్కి మళ్ళీ దిగేసరికి-నదిపేరు మారకపోయినా నీరు మారుతుంది- పాత నీరుపోయి కొత్తనీరు వస్తుంది. వ్యక్తి, జీవితం, చరిత్ర కూడా యింతే.

అన్ని దశల్ని పూర్తిగా చూపడం సాధ్యం కాదు. కొన్ని ఘట్టాల్ని ఎన్నుకొని వివిధ దశల్ని చూపడం, వొక దశనుండి యింకో దశకు మారడం సూచించడంకోసం చండీదాస్‌గారు ఐదు స్థితుల్ని స్త్రీ జీవితంలో ఎన్నుకున్నారు. ప్రతి కథ వొక ఘటనా, పాత్ర మనుగడ మీద దాని ప్రభావం చిత్రించి, పాత్ర చెందే నూతన స్థితిని సూచిస్తుంది. అన్ని కథలూ కలిపి చూస్తే వివిధ సంఘటనల్ల సంయోగం, పాత్ర పూర్తి జీవితం వివిధస్థాయిల్లో వ్యక్తమవుతుంది. నాటక రూపంగా ప్రతి అంకం వొక ముఖ్య జీవిత సన్నివేశంలో పాత్ర పోరాడటం, ప్రతిఫలం, మార్పు, చిత్రిస్తూ ఐదు అంకాలు కలిసి మొత్తం జీవి వేదన కళ్ళకు కట్టినట్లు చూపిస్తాయి. నవల-జీవి తాన్ని, దాన్నించి విడదీయటానికి వీలులేకుండా పేరకాయిపీచులా పెనవేసుకుపోయిన సంఘం, దాని మంచీ- చెడూ చూపిస్తుంది. కథా నిక- నిండుజీవితాన్ని స్ఫురింపజేస్తూ వొక సంఘటన్ని సంపూర్ణంగా చిత్రిస్తుంది. నాటకం- అంకంనించి అంకానికి వ్యక్తి పాత్రత చూపిస్తూ మొత్తం కలిపి పూర్తి జీవితం ప్రత్యక్షంగా ప్రదర్శిస్తుంది. కథానిక సెలయేరు. నవల నిండునది, నదీసాగర సంగమం నాటకం.

ఈ మూడు ప్రక్రియల ఆయువుపట్లూ సంలీనం చేయడం ద్వారా జీవి వివిధ రూపాలు, స్థాయిలు చూపిస్తూ, జీవికి వునికిచ్చి ముందుకు నడిపే అనంతశక్తుల్ని చూపించడానికి వీలయింది. ప్రాణిని శారీరకంగా నిలబెట్టేది ఆకలి. మానసికంగా సజీవంగా నడి పించేది తృష్ణ. ఈ ఆకలీ, తృష్ణా తీరడమంటూ ప్రాణం వున్నంత వరకు జరగదు. శారీరక మానసికమైన యీ రెండు అనంత శక్తుల ఐక్యమైనది లైంగిక వాంఛ. జీవికి వుపాదుల్ని యిచ్చే యీ రెండు అనంతశక్తుల రూపం లైంగిక వాంఛ కనకే యిది మనిషిచేత ఏద యినా చేయించగలదు. మనిషిని ఏదయినా చేయగలదు. చీకట్లోంచి వెలుగులోకి లాగి చీకట్లోకి తోసేది యీ లైగింక వాంఛే.

[మిగతాది 'చీకట్లోంచి చీకట్లోకి' చదివాక, చివర్లో]

# చీకట్లోంచి చీకట్లోకి

వడ్డెర చండీదాస్

## అరుణ

తెల్లని బట్టలు తొడిగి ఆటకి వొదిలిన నల్ల ఎలుగుబంటిలా; రోడ్డు మీద కదులుతున్నాడు, కాశీపతి. వాడికి కొత్త దూరంలో, ముందు ముక్కుకి పళ్ళు జివ్వున లాగినట్లు నా మనసు నన్ను లాక్కుపోతోంది.

కొంపలోంచి బయటికి వొచ్చేముందు అద్దంలో చూసుకున్న నా రూపు, వాడి వీపులో మెరుస్తున్నట్లు నా కళ్ళకి అనిపించింది. అంతలోనే, రాఘవ రూపు మెరిసింది. రాఘవ- అప్పట్లో, మా యింటికెదురుగా గదిలో అద్దెకుండి, కాలేజీలో బియ్యే చదువుతూ వుండేవాడు. అప్పటికే నేను ఇంటి గుమ్మం దాటి ఆరేళ్ళు. తొమ్మిదో తరగతి తప్పితే; అసలే యిష్టం లేదేమో-ఆడపిల్లకి చదువెందుకని మానిపించేశారు. కట్నమూ యివ్వలేరు, పెళ్ళీ చెయ్యలేరు, చదువూ లేదు-చివరికి ఏం చేసేవారో- రాఘవతో కలిసి యీ రాజధానికి వొచ్చేసి వుండకపోతే! వొచ్చేసి- వెంట తెచ్చుకున్న ఐదారు చీరలూ గాజులూ గొలుసూ ఎన్నాళ్ళొస్తాయని-రాఘవ పరీక్ష ఫలితాలొచ్చి, వుద్యోగం కోసం తిరిగి తిరిగి- ఏదో టెంపరరీ క్లర్కు వుద్యోగం రావటమూ, మూణ్నెల్లకి వూడటమూ, మళ్ళీ వోనెలా నెలన్నరా తిరగటమూ, మళ్ళీ వో టెంపరరీ క్లర్కు వుద్యోగం రావటమూ, పోవటమూ- వస్తులు మాడటమూ చింకిపేలికలు చుట్టుకోవటమూ, ఆ మురిగ్గూటికి నెలనెలా యివ్వాల్సిన పాతిక రూపాయలూ యివ్వటం, ఆలస్యమైతే యిల్లుగలాయనతో నానా చివాట్లూ తినటమూ -కుక్క బతుకై పోయింది. పాపం, ఎలాంటి రూపం ఎలా అయిపోయాడు, రాఘవ! ఆ కమీషన్ కొట్లో పనికి నెలకి ఎనభై రూపాయల ముష్టి పారేస్తున్నారు. మూణ్నెల్లనుంచి, రాత్రీ లేదు, పగలూ లేదు-వెట్టిచాకిరీలాగై పోయింది. తనకీ సుఖంలేదు, నాకూ సుఖం లేదు, నేనే లేకపోతే;

వొంటరిగాడు, ఎలాగైనా తేలిగ్గా బతికెయ్యగలడు. కానీ-అనుకున్నది అనుకున్నట్లు ఐతే-రాఘవ ఆఫీసరవుతాడు.

ఏమైంది. ఎలుగుబంటి కిందకి వొంగుతున్నాడు? చెప్పు పట్టీ తెగిందా? కీళ్ళు పట్టేశాయా? నుంచోటం మేలు-అః, లేచాడ్లే-అదేం నడక-దొల్లుతున్నట్లు- వీడి పెళ్ళాం కొంతకాగులాగుంటుంది. ఆవాళ, ఆబిడ్స్‌లో స్లీవ్‌లెస్‌లకేసీ లోనెక్‌లకేసీ మినీస్కర్ట్‌లకేసీ వహా దాహంగా దొంగ చూపులు చూస్తూ కనిపించాడు. ఈ ఎలుగుబంటి కెన్నేళ్ళుంటాయి ఇంతకీ? యాభై రెండో, మూడో, ఐదో- అంతకైతే మించవు. ఐనా, బుర్ర, నెయ్యిరాసిన మాడుచక్కలాగైంది. ఆ కొంతకాగు పీకేసుంటుంది. వొచ్చేసింది పబ్లిగ్గార్డెన్. ఎక్కడ కూచుంటాడింతకీ-రోజూ తగలడే చోటేనా-వీడికి వంటరిగా యీవెనింగ్ వాకూ అదీ అలవాటుండటం మేలైంది-లేకపోతే, ఎలా వీలు చిక్కుతుంది-అదో, అక్కడే సిమ్మెంటువస్తా పక్కగా పచ్చికమీద కూచుంటున్నాడు. వారం రోజులుగా, వీడు ఎప్పుడెప్పుడు ఎక్కడెక్కడ తిరిగేదీ గమనించటం పెద్ద పనై పోయింది. రాఘవ అన్నాడు; వీడిలాంటి వాడు తలుచుకుంటే, కానిపనంటూ లేదని- ఇదంతా రాఘవకి తెలిస్తే-ఎందుకు తెలవాలి-ఆవాళ, గ్రూప్ వన్ పరీక్షలకి కూచోమంటే, నవ్వి, అవన్నీ మనలాంటి వాళ్ళకి కాద న్నాడు, రాఘవ. ఐనా, నా మాట కాదనలేక, ఒప్పుకున్నాడు. బాగానే రాశానన్నాడు. ఐనా, ఆ బాగెవడు చూడొచ్చాడు! వచ్చే వారంలో ఇంటర్వ్యూ.

చప్పుడికి తుళ్ళిపడ్డాను. నీళ్ళలోకి రాళ్ళు విసిరి గెంతుకుంటూ పోతున్నారు, పిల్లలు. సూర్యుడు, గూటికెళ్ళి దుప్పటి ముసుగు తన్ని పట్టినట్లున్నాడు. నల్ల ముఖానికి అరచేతి మందాన ఆప్టన్ పవుడ్రద్ది సినిమాకి బయల్దేరిన గూడెం పిల్లలాగుంది, వెన్నెల రాత్రి. కాశీపతి కేసి చూశాను. కొండముచ్చుకి జీడిగింజల పొగ వేస్తే అచ్చూ ఇలాగే వుంటుందనిపించింది.

చుట్టూ చూస్తూ కూచున్నాను. ఎంతకీ కాలం జరగటంలేదు. మహా ఐతే, ముప్పావుగంట గడిచి వుండాలి. అంతలో, ఎక్కడో

ఏ[illegible]రు

ఎనిమిది గంటలు మోగిన చప్పుడైంది. శుభం అనుకుంటూ లేచాను. అటూ యిటూ తచ్చాడి, చీరకుచ్చిళ్ళు రవంతపైకి ఎత్తి పట్టుకుని. నీళ్ళలో కాళ్ళు తడిపి, మళ్ళీ అటూ యిటూ తచ్చాడి, సిమ్మెంటు చప్టామీదకొచ్చి, కాలు జార్చి నేలమీదకి ఢభీమని పడి, "ఆఁ," అన్నాను. కాశీపతి తల యిటు తిప్పి చూశాడు. అనుకున్నట్లుగా పడ గలిగినందుకు అభినందించుకున్నాను. మళ్ళీ, "ఆఁ," అన్నాను. "వాట్ హేపెన్డ్" అంటూ లేచాడు. "కాలు జారింది" అన్నాను-యీ సిమ్మెంటు చప్టామీద నిజంగానే కాలుజారి పడుంటే, చచ్చేంత దెబ్బ తగిలుండును-అని అనుకుంటూ.

"బాగా దెబ్బ తగిలిందా?" అన్నాడు కొద్దిగా వొంగి.

"వ్హూఁ, వ్హుఁహూఁ-తగిలింది."

"రిక్షా పిలుస్తాను. వెళ్దువు." అని కదలబోయాడు.

"ఆబ్బే, అక్కర్లేదు తగ్గిపోతుంది. మా యిల్లు యీ పక్కనే చిరాగ్ అలీ లేన్‌లో. సారీ, మిమ్మల్ని డిస్టర్బ్ చేసినట్లున్నాను. కూచోండి. మీకెందుకు శ్రమ?" అన్నాను.

"ఇట్సాల్ రైట్. ఎట్లాపడ్డావ్? కాలు మెలికపడిందా?" అంటూ పచ్చికమీద కూర్చున్నాడు.

"తడికాళ్ళు. చెప్పు జారింది." అని, దొక్కుచెప్పులు వాడి కంట పడకండా పాదాలు చెప్పులమీద వేసి, కొస్త ముందుకు వొంగి కుడిపాదం మీద చెయ్యివేసి వొత్తుకున్నాను.

మీ నాన్నగారేం చేస్తారు, నువ్వేం చేస్తున్నావు లాంటి ప్రశ్నలు మొదలెట్టాడు. టైపిస్టుగా పని చేస్తున్నానని ఏవేవో టొంకి సంభాషణ వేరే విషయాల్లోకి మార్చి. మధ్య మధ్యలో పల్చని నవ్వులు విసురుతూ లైనులోకి పట్టుకొచ్చాను.

నా చవకబారు నైలాన్‌చీర వెన్నెట్లో ధగాధగా మెరుస్తోంది. పవిట పక్కకి జారేలా కదిలి చేతులు వెనకవైపున ఆన్చి-స్తనం పొడుచుకుపోయి వాడి కనుగుడ్డులో గుచ్చుకునేలాగా-పీపు ముందుకు

విరిచాను. బాగా లోతుగానే దిగబడినట్లుంది; గుడ్లు తేలేసి- మిటకరించి, తేరుకుని, రెప్పలు కదిల్చి....పళ్ళికిలించాడు.

కుచ్చిళ్ళు రవంత పైకి కదిల్చి, కాలు ముందుకు జాపి "అబ్బా" అన్నాను బాధగా.

"నొప్పిగా వుందా?" అని పాదంమీద చెయ్యి వేశాడు.

గబుక్కున కాలు పక్కకి లాక్కున్నాను. కదలికలో జరిగినట్లు అనిపించేలాగా చీర మోకాటి వరకూ జరిగేలా లాగాను. అదే చూస్తూ, "నీ పేరేంటి?" అన్నాడు. నోటి కొచ్చిన పేరు చెప్పాను.

"రాగిణీ—"

యేమిటన్నట్లు చూసి, చిలిపిగా నవ్వాను.

ముందుకు వొంగి నా భుజాల మీద చేతులు వేశాడు. అవతలికి జరిగినట్లుగా కదిలి, కోపంగా చూశాను.

"సారీ" అన్నాడు.

వాడి నరాలు మెలి తిరిగేలా; వొంపులు రూపమై వొళ్ళు విరుచుకున్నాను.

వాడి చూపు నా స్తనాల మధ్య లోతులో దిగబడింది; పై, గుంజుకోలేక గుటకలు మింగుతున్నాడు.

జుట్టు సవరించుకున్నట్లుగా చెయ్యి పైకెత్తి; నిశ్శబ్దంగా నవ్వాను.

నా మీదకి వొరుగుతూ, "రాగిణీ—" అన్నాడు.

వాడి భుజం మీద చెయ్యి వేసి—అవతలికి తోసెయ్యకుండా, పట్టినే అటకాయించాను.

"రాగిణీ, నన్ను కాదనకు-నీకేం కావాలంటే, అది—" అని మొదలెట్టి నాలుగు సిన్మా డైలాగులు చదివాడు.

"నే నివ్వగలిగేదానికి సమానంగా మీరు నాకేమివ్వగలరు?" ..

"నువ్వేం కావాలంటే అదిస్తాను—"

కాస్త చొరవ దొరికినట్లుంది. మరి కాస్త దగ్గరికి పాకుతున్నాడు.

"సమానంగా మీరేమీ యివ్వలేరుగాని; కనీసం నేనడిగింది యివ్వండి. ఆనక మాట తప్పితే, నేను మిమ్మల్నేం చేయటానికైనా సాహసించగలను సుమా!"

"హాట్టు, దేవుడితోడు. అసలు నీ కోసం యేమైనా యిస్తాను-"

బుగ్గచుట్టూ పెదాలు బిగించి, బాగా గంటుపడేలా కసిగా కొరికాను. 'అబ్బా' అని గిలగిల్లాడి-అంతలోనే, చలికి తట్టుకోలేక వొంటికి రగ్గు చుట్టుకున్నట్లుగా, నన్నలుముకున్నాడు.

కడుపులో ఆకలిమంట; వాడి చేతి స్పర్శవల్ల కలిగిన వికారం మంట; మనసులో నా దైన్యస్థితికి మంట-కళ్ళు మూసుకుని, మూతి బిగబట్టి వాణ్ణి నాకేసి అదుముకున్నాను.

టాకీస్. హోటల్లో గది.

వాడి మూతి మీద పెదవులు ఆన్చాను. చీమిడుముక్కుమీద మూతి ఆనినట్లు; నాలికతో అ రసి నాకినట్లు---

అబ్బా అ-యింత భయంకరమని తెలిస్తే యెందుకు సాహసించకనే పోదును.

ఐనా, అధరాలు పిండి, గుండెల్ని పొంగించి—అమృతం బొట్లు రాల్చాను. వెన్నెలలు కురిపించాను. మంచుసోనలు జాల్వారించాను. మెత్తని మెరుపుతీగల్తో మైమరిపించాను. పుప్పొడి చిలకరించాను.

*　　　*　　　*

అందుకు పర్యవసానంగా; నా మనసున చిందిన నెత్తుటిబొట్లు. గుండెలో గడ్డకట్టి వడ్లరాళ్ళలా గుప్తంగా నిలిచిపోయాయి.

ఐతేనేం, అందుకు ప్రతిఫలంగా; నా రాఘవ సెలక్టయ్యాడు.

*　　　*　　　*

ట్రైనింగుకి రాఘవ ఢిల్లీ వెళ్ళి ఆర్నెల్లయింది. వెళ్ళాక. వారానికీ పది రోజులకీ వో పుత్తరం రాసేవాడు. నెలనెలా డబ్బు

పంపేవాడు. సెలక్టయినట్లు తెలిసినరోజున చూడాలి. రాఘవని! గదిలో నేలమీద పిల్లి మొగ్గలేశాడు. నన్ను వాటేసుకుని గిరగిరా అల్లీబిల్లీ తిరిగాడు. వారపత్రికలు చేతపుచ్చుకుని యింటికప్పుకి కొట్టు కునేలా యెగరేశాడు. సంతోషం పట్టలేక పిచ్చి పిచ్చిగా అరిచేశాడు. "'నువ్వు' నా అదృష్టదేవతవి, అరూ-" అన్నాడు. నేనే తనకి వుద్యోగం యిప్పించానన్నాడు. నిజంగా నేనే యిప్పించినట్లు తనకి తెలిస్తే! కానీ, నేను తనదాన్ని. తను నా సర్వస్వం. నన్ను నేను అమ్ముకోలేదు. తన కోసమే నన్ను నేను పూర్తిగా పవిత్రంగా వుంచేసుకున్నాను. దరిద్రాన్నీ అవమానాన్నీ ఆకలినీ కన్నీళ్ళనీ మురికినీ అమ్మేశాను. అమ్మేసి; సుఖశాంతుల్ని కొన్నాను. తన కోసం నా కోసం. అందరూ అర్థం చేసుకోలేకపోవొచ్చు. తను కూడా అర్థం చేసు కోలేడేమో! నా రాఘవ అలాంటివాడు కాడు. నే నేవిఁటో తనకి తెలుసు. అసలు తనకి తెలిస్తేగా-మా సుఖశాంతుల జీవన సౌధానికి యీ రహస్యం, పునాది. ఆ కన్నీటిరాళ్ళ పునాది నా గుండెల్లోపలికి దిగబడింది. అదెవ్వరికీ కనపడదు.

ఆ తరవాత వొకటి రెండుసార్లు కాశీపతి కనిపించారు. తను రెండుసార్లు ఢిల్లీ వెళ్ళినట్టూ రాఘవని కలుసుకున్నట్లూ చెప్పారు. రాగానే డిప్యూటీ కలెక్టరవుతాడనీ, ఆ తరవాత కలెక్టరూ సెక్రటరీ చేయించేస్తాననీ చెప్పి-కారులో గండిపేట వెడదామన్నాడు. యిద్దరం మాట నిలబెట్టుకున్నాం-అంతే, అదంతటితో చెల్లు-అని తీక్షణంగా జవాబిచ్చాను.

యీ మధ్య రెణ్ణెల్లుగా రాఘవ దగ్గర్నుంచి వుత్తరవేఁ రాక పోయేసరికి, కాశీపతిని కలుసుకున్నాను. కారు యాక్సిడెంటులో కుడి చెయ్యి మణికట్టు దగ్గిర విరిగిందనీ, కట్టుకట్టారనీ, వుత్తరం రాయ లేకపోతున్నాడనీ చెప్పారు. అందుకుగాను ఖర్చు పెరిగి డబ్బు పంపలేకపోతున్నట్లూ చెప్పారు. చిన్న చిన్న అప్పులు బోలెడు చేశాను. తరచూ వస్తులుండాల్సొస్తోంది. యిల్లుగలాయన చాలా హీనంగా మాట్లాడుతున్నాడు. రాఘవ పంపించగానే తీర్చేసెయ్యొచ్చు గదా- అని, కాశీపతినీ రెండొందలు అప్పు యివ్వమన్నాను. నీకే

నేను బాకీ వున్నాను. తీసుకుందువులే-అవి పాత వరస కలపబోయాడు. చివాట్లేసి వొచ్చేశాను.

మరో మూణ్ణెల్లు గడిచాయి. యెలా గడిచాయో గుర్తు తెచ్చుకోటానికి కూడా భయమనిపిస్తుంది. అబద్ధాలాడి, డాంబికాలు పలికి-కిరాణా కొట్లోనూ అక్కడా యిక్కడా అప్పులుచేస్తూ-మొండికేసి యిల్లు గలాయన గుచ్చే ములుకు మాటలు భరించాను. రాఘవకి యిరవై ముప్ఫై వుత్తరాలు రాశాను. తను రాయలేకపోతే, తన క్షేమం గురించి యెవరితోనైనా రెండు ముక్కలు రాయించమన్నాను. డబ్బు పంపమనలేదు. వీలైతే తనే పంపునుగదా-పాడు యాక్సిడెంటు, యెంత ఖర్మ్లో వున్నాడో-యింకా నయం. అంతటితో పోయింది. తొమ్మిది నెలలకి ఎముక కుదురుకుంటుందట.

పొద్దుట్నించీ యేం తినలేదు. నీరసంగా వుంది. రోజుకి వొక్క పూట వక్కెడు మెతుకులు తిన్నా. బియ్యం గింజలు రాత్రితో విండుకున్నాయి. మళ్ళీ ఆ సేటు దగ్గిర వుచ్చుకోవాలంటే యజ్ఞం చేసినంత పని. ఐనా తప్పదుగా-యిల్లుగలాయన బట్టల దుకాణం నుంచి వొచ్చే వేళయింది. కాసేపు ముఖం చాటేస్తే, ములుకు మాటలు వకపూట తప్పినా తప్పినట్లేగా-అనుకుని, లేచాను.

తాళం వెయ్యబోతుండగా-యింటిముందు కారాగిన చప్పుడు-ఆశ్చర్యం! కాశీపతి; దొల్లుకుంటూ వొస్తున్నాడు. తాళం బిగించకుండా తలుపులు నెట్టి గుమ్మం లోపలికి వెళ్ళి నిలుచున్నాను.

"శుభవార్త, అరుణా" అంటూ లోపలికి రాబోయాడు.

అలాగే నిలుచున్నాను; అనుమానంగా వాడికేసి చూస్తూ.

"రాఘవ ట్రైనింగ్, సక్సెస్‌ఫుల్లీ కంప్లీట్. వెంటనే అపాయింట్‌మెంట్ ఆర్డరిచ్చారు. విశాఖలో వేశారు. మధ్యాన్నమే తెలిసింది. సాయంత్రం రాఘవ దగ్గర్నుంచి టెలిగ్రాం వచ్చింది-చేతి కట్టు యింకో రెండు వారాలలో విప్పుతారనీ. తను డైరక్టుగా విశాఖ పట్నం విమానంలో వెళ్తున్నట్లూ, నిన్ను నేరుగా అక్కడికి పంపమనీ-" అని లోపలికి రాబోయాడు. రెండడుగులు లోపలికి వేశాం. వచ్చి, జేబులోంచి కాగితం మడత తీశాడు. రెండు వందరూపాయ నోట్లూ, ఓ కాగితమూ.

నా చెయ్యి పట్టుకుని, వేళ్ళ మధ్య ఆ కాగితాలు నొక్కుతూ, "వెంటనే బయల్దేరు. పదింటికి హవ్‌రా యెక్స్‌ప్రెస్సుంది. ఆ కాగితంలో అడ్రసుంది. రయిలు దిగి టాక్సీ యెక్కి నేరుగా వెళ్ళు. బిజీపీ డిన్నరుంది. నేను, అర్జంటుగా వెళ్ళాలి-కలెక్టరు భార్యవయ్యే పని నన్ను మర్చిపోబోకూ—" అంటూ బోలబోలగా నవ్వి, బయిటికి దొర్లిపోయాడు.

వెంటనే బజారెళ్ళి ముప్పయ్ రూపాయలు పెట్టి వో జార్జెట్ చీర కొని తెచ్చుకున్నాను. చింకిపేలికలకేసి కడసారి చూపు చూస్తూ, అది కట్టుకున్నాను. అప్పుల విషయం తరవాత చూసుకోవచ్చు లెమ్మనుకుని, యెవరికీ చెప్పకుండా వెంటనే బయల్దేరాను.

మరనటిరోజు మధ్యాన్నానికి వాల్తేరు చేరింది రైలు. టాక్సీ యెక్కి, అడ్రసు చెప్పి కూర్చున్నాను. పావుగంటకి ఓ పెద్ద బంగళా ముందు ఆగింది. దిగి, చుట్టూ పరికించిచూసి లోపలికి వెళ్ళాను. ఓ మునలతను వరండాలో నేలమీద కూచుని వున్నాడు. నేను ఫలానా అనీ, రాఘవగారి కోసం వచ్చాననీ చెప్పాను.

లేచి దణ్ణం పెట్టి, ఆప్యాయంగా లోపలికి తీసికెళ్ళాడు. తను ఆఫీసు జమానుట. రాఘవ కేంపు కెళ్ళాడట. స్నానం ముగించి- యిల్లంతా పరిశీలనగా చూశాను. బోసిగా వుంది. యెంత ఫర్నిచరు కావాలో—యాదంతా అమర్చాలంటే! తనొచ్చాక సామానుకొంటాననీ అందాకా హోటలునుంచి భోజనం తెచ్చి పెట్టమనీ చెప్పాడట.

యేరోజు కారోజు యెదురుచూడటమే అయిందికానీ, రాఘవ యింకా కేంపునుంచి తిరిగి రాలేదు. విసుగుగా అనిపిస్తోంది. అలా బీచికి వెడదామా-అని అనుకుంటుండగా, జమాను వచ్చాడు బయిటి నుంచి.

"అర్జెంటుగా రాజమండ్రికి కేంపడేసినాదంట. పదేన్రోజు లక్కడే వుండీసెయ్యాలంట. తున్నుంచి ఆటే యెళ్లిపోనారంట. టీ. బీ. లో మకావంట, తవర్ని వెంటనే బయిలెల్లి రమ్మని ఆఫీసు క...బురెట్టినారు."

"రైలెప్పుడుంది?"

"యింకో గంటకుందాల."

కొత్తగా కొన్న బ్రీఫ్‌కేస్‌లో బట్టలు సర్దుకుని బయల్దేరాను. రైలు అరగంటే లేటయినా ఆరుగంటలు లేటన్నట్లుగా అనిపించింది.

రైలు తుని స్టేషన్లో ఆగింది. చాలామంది భోజనాల కోసం దిగిపోయారు. యింకొద్ది గంటల్లో నా రాఘవని కలుసుకోబోతున్నానన్న సంతోషంలో ఆకలిగా అనిపించలేదు.

యేం తోచక, ఎదురుగా వున్న బల్లమీద రెపరెపలాడుతున్న పేపరు తీసి ఆవైపూ యీవైపూ చూసి, పేజీ తిప్పాను—

గుండెలో యేదో టక్‌మన్న సంచలనం—

ఫోటో. రాఘవ; ప్రక్కన వో అమ్మాయి.

సర్వీస్ కమీషన్ మెంబరు శ్రీ కాశీపతిగారి కుమార్తె చి. సౌ. వాసంతికి హైదరాబాదులో సబ్‌కలెక్టర్‌గా నియమితులైన చి. రాఘవరావుకు జరిగిన వివాహసందర్భంలో తీసిన....

ఆ పైన నా కళ్ళకి యే అక్షరాలూ కనిపించలేదు.

సీట్లోంచి జారిపడిపోతానేమో అనిపించింది. పడినా పడక పోయినా వొకటే.

కాశీపతిగారూ; అప్పుడనుకోలేదుగానీ, ఆనాడు నిజంగానే కాలు జారాను।

# సావిత్రి

సావిత్రి యింటిగుమ్మంలో కొచ్చి నుంచుంది. వొస్తాడన్న నమ్మకం లేని భర్త, వొస్తాడన్నట్లుగా చూసింది.

దుమ్ములోపడి నలిగిపోయిన తమలపాకులా ముఖం- విషాదంతో వొడిలింది. బాగా మాసిపోవటంవల్ల, నెయ్యటమే చిరుగుల్తో నేసినట్లనిపించే వాయిల్ చీర, నలిగిందని అనటానికి వీల్లేనంతగా నలిగి వుంది. గూటి దగ్గిర పిగిలిన బ్లౌజులోపల—ఆ తినే అర్ధాకలి తిండీ మరే అవయవానికీ దక్కకుండా గుంజేసినట్లుగా అనిపించే గుండ్రని స్తనాలు; తేరగా వొస్తే తిని బలిసిన అధికారుల్లా వున్నాయి. యే ఆడదైనా అందంగానే కనిపించే చిత్రకార్తి కళ్ళకి తప్ప. సావిత్రి అందంగా వుంటుందని మరెవరికీ స్ఫురించదు. అలా వున్నపళంగా రోడ్డువెంట వెడుతోంటే; ఏ మగచూపులూ ఆమె మీద ప్రత్యేకంగా వాలవు.

సావిత్రి దరిద్రంగా వుంది. దరిద్రంవల్ల దరిద్రంగా వుంది. దరిద్రం ఎలా వుంటుందంటే—దరిద్రం మరి దేన్లాగానూ వుండదు. దరిద్రం దరిద్రంలాగానే వుంటుంది. దరిద్రం నెత్తిన అలంకారాల కుచ్చు తురాయిలు పెట్టినా దరిద్రం అంటే తెలియనివాడికి దరిద్రం అంటే తెలియదు. అది అనుభవైకవేద్యం. అంచేత అది మీ కను భవంలోకి వొచ్చివుండకపోతే, చెప్పి లాభంలేదు; వొచ్చివుంటే, చెప్పాల్సిన అవసరం లేదు. మరిదేవిటంటే, తిరిగే కాలూ, తిట్టే నోరూ లాగే రాసే చెయ్యాన్నూ—

చూడనట్లుగా చూసి, చూసినట్లుగా చూడకుండా, లోపలికి వెళ్ళింది. మళ్ళీ వచ్చింది. మళ్ళీవెళ్ళింది. మళ్ళీ వచ్చి మళ్ళీ వెళ్ళింది. వెళ్ళి చూసింది.

పూచబొావికల గూట్లో బిర్రబిగిసిన యేణ్ణర్థం పిల్లణ్ణి చుట్టుకుని అంటకాగిపోతోంది, జ్వరం. చూట్టానికి యేణ్నర్థం పిల్లాడిలాగే వున్నాడు గానీ, వాణ్ణి మూడేళ్ళ క్రితమే కనింది సావిత్రి. వారం రోజులుగా వేళతప్పకుండా ధర్మాసుపత్రి వాళ్ళిచ్చిన రంగునీళ్ళు వాడికి తాగిస్తూనే వుందిగానీ. ఆ నీళ్ళకి చల్లబడిపోయే వేడి కాదది. అక్కడికీ దొరికిన మేరకి అప్పుచేసి తెల్లటి మందుబిళ్ళలు వాడింది. రంగుల ముచ్చిక మాత్రలూ, యింజక్షన్లూ వాడితే తప్ప లాభం లేదని పొద్దుటనగా కసురుకున్నాడు, ఆ వీధి మొగనవున్న డాక్టరు బాబు. యాభయ్ రూపాయలన్నా లేంది అవి రావు. మధ్యాన్నం కూటికొచ్చినప్పుడు మొగుడుతో అంటే, యాభయ్యే గదా గంటలో పట్టుకొస్తానని వెళ్ళాడు. ఆ మొగుడుకోసం అన్నట్లుగా, ఆ గూట్లో యిందాకట్నుంచి అటూ యిటూ తిరిగింది.

వొంగి పిల్లడి వొంటిమీద చెయ్యివేసింది. ఆమె కంట్లోంచి నీటి బొట్టు రాలింది. కాగుతున్న వొంటిమీద పడిందేమో; పడటంతోటే ఆవిరైపోయింది. బాబూ అని పిలిచింది. యిద్దరికీ మధ్య కంచుగోడలా జ్వరం అడ్డుకునుండటంవల్ల వాడికి వినిపించలేదు. చేత్తో కుదిపింది. గుండె గొంతుక చేసుకుని బాబూ - బాబూ, అని పిలిచింది. కళ్ళ రెప్పలు తెరుచుకోవటమైతే తెరుచుకున్నాయి గానీ, మూసుకోవటం యిష్టం లేనట్లుగా ఆగిపోయాయి. వాడి ముఖానికి అరిచేతులు చుట్టి బాబూ-బాబూ, అంది. వినిపించిందిలే-అన్నట్లుగా రెప్పలు ముడుచుకున్నాయి. కాసేపు ఎక్కడి గాలీ చాలనంతంగా పీలుస్తున్నట్లూ, మరి కాసేపు పిసరంత గాలికూడా చొరనివ్వకుండా అడ్డుకున్నట్లూ- కదుల్తూ, బిగుసుకుంటూ- సావిత్రిని కాల్చేస్తున్నాడు.

లేచి నుంచుని, మళ్ళీ గుమ్మంలోకి వెళ్ళింది. తన భర్త రాడు. వేళకి వొచ్చేవాడే ఐతే, మందులకి డబ్బులు తెచ్చేవాడే ఐతే; అతను తనకి భర్త అయ్యేవాడే కాదు—అన్నట్లుగా తల కదిపి, లోపలికి వొచ్చింది. కింద చతికిలబడి పిల్లడి మీద చెయ్యి వేసింది. ఆ ఆదుర్దాలో భయంలో బలహీనంగా కొట్టుకుంటున్న నాడి. అసలు కొట్టుకోనట్లుగా అనిపించింది ఆమెకి. భయంతో కంపించింది—

అనంతంలోకి నిశ్చలంగా చూసింది. లేచి నిలుచుంది. కను రెప్పలు వాల్చి శ్వాస గట్టిగా పీల్చింది.

గబగబా ముఖమూ, కాళ్ళూ చేతులూ కడుక్కుంది. రేకు పెట్టె అడుగున వున్న కొత్త మాయని పాతచీర తీసి కట్టింది.

వీధిలోకొచ్చింది. వడి వడిగా నడుస్తోంది. మసకమసకగా వున్న బొమ్మల్లా ఆలోచనలు జరిగిపోతున్నాయి. వెనక్కి-ఆమె శేషావతారం యింట్లో వంటమనిషిగా వుంటున్నప్పటి దాకా.

వంటమనిషిగా వుండతగనిదే ఐనా, అప్పట్లో శేషావతారం యింట్లో వంటమనిషిగా వుండేది సావిత్రి. ఎందుకుండేదంటే; ఆఫీసర్లుగా వున్నవాళ్ళలో చాలామంది గుమాస్తాలుగా వుండాల్సినట్లూ గుమాస్తాలుగా వున్నవాళ్ళలో కొద్దిమంది ఆఫీసర్లుగా వుండాల్సినట్లూ వుండాల్సొచ్చినందుకు వుండేది.

శేషావతారం ఎంతో దయతో చూసేవాడు. ఆయన భార్య, నోటి గట్టితనమేగానీ, మనసు మెత్తన. పిల్లలు యే విషయమూ పట్టించుకునే వాళ్ళు కాదు. సావిత్రి తొమ్మిదో తరగతిదాకా చదివి నట్లు తెలిసిపోయాక తీరికసమయంలో చదువుకుంటూ మెట్రిక్ పరీక్షకు కట్టమన్నాడు, పుస్తకాలు కొని తెచ్చాడు. అప్పటికింకా సావిత్రి మొగుడవని సావిత్రి మొగుడు, అప్పట్లో శేషావతారం యింటికి అడపాదడపా వొచ్చిపోతుండే వాడు. అతను శేషావతారా నికి దూరపుచుట్టం. రూపాయీ రెండూ అడిగి పుచ్చుకుపోతూ వుండే వాడు. పనీ పాటా లేను. జులాయి తిరుగుడు. కిళ్ళీబడ్డీ పెట్టుకుని కుదురుగా చేసుకునేట్లయితే డబ్బు సర్దుతాగా వెధవా, బాగుపడు- అని శేషావతారం వోరోజున అంటే, సరేనని బడ్డీ తెరిచాడు.

మాటలపోగేమో, బాగానే నడిపాడు. అప్పుడప్పుడూ చాటుగా తాగేవాడు. వందా యాభయ్ శేషావతారం దగ్గిరే దాచుకుంటూ వుండే వాడు. సావిత్రి కంటపడితే నిలువుగుడ్లేసుకుని చూస్తూ వుండిపోయే వాడు. యేణ్ణర్థం అలా గడిచింది. అంతలో సావిత్రి మెట్రిక్ పాసయియింది. మంచి కుదురూ అదీ అబ్బిందని మెచ్చుకుని, అతనికీ సావిత్రికీ పెళ్ళిచేశాడు. శేషావతారం. ఆ తర్వాత కిళ్ళీబడ్డీ

లోనే బ్రాకెట్టూ అదీ మొదలెట్టి ఐదారు వేలు సంపాదించాడు. ఆ మీదట బడ్డీ యెత్తేసి. లారీలనీ యివనీ అవనీ దిగి. రాజమండ్రి నుంచి కాకినాడకి మకాం యెత్తేశాడు. కాకినాడ వొచ్చాక సావిత్రి పిల్లల్ని కనింది. ఆ వ్యాపారమనీ యీ వ్యాపారమనీ ఆ డబ్బు హరించింది. ఎందులోనన్నా నాలుగురాళ్ళు గిడితే తాగుడూ గట్రా అనుపానాలతో గడుపుతాడు.

యిల్లు గడవక. సావిత్రి ఎలిమెంటరీ స్కూల్లో టీచరుగా చేరింది. పక్కవీధిలోనే స్కూలు. దాంతోటే సంసారం గడవటం అందులో కూడా ఐదూ పదీ గుంజుకుపోతూ వుంటాడు. సావిత్రి అప్పుడప్పుడూ అనుకుంటూ వుంటుంది- తను యీ పెళ్ళికి సిద్ధపడకపోతే బాగుండేదని. తనంటే యిష్టపడిన వాడు. కుదురుగా వ్యాపారం చేస్తున్నవాడు భర్త అవటం: అందునా తనని కూతుర్లా అప్యాయంగా చూసే శేషావతారం సూచించటం వల్లా. అందుకు యిష్టపడింది. కిళ్ళీబడ్డీ ఎత్తేసి యేవేవో వ్యాపారాలంటూ మొదలెట్టినప్పుడు, శేషావతారం చాలా నొచ్చుకున్నాడు, చివాట్లేశాడు.

శేషావతారం కళ్ళముందు మెదిలేసరికి, ఆమె కళ్ళు తడిబారాయి.

* * *

"వో టీ యిచ్చుకో గురూ" అని పోలిశెట్టికి ఆర్డరేసి కొయ్య బెంచీమీద కూచున్నాడు సింహాచలం. అంతలో దూరాన కోదండం కనిపించటంతో లేచి నుంచుని గ్లాసు అందుకుని గబగబా తాగేశాడు. రిక్షా జోరుగా తొక్కుతూ కోదండం దగ్గిరికి వెళ్ళి, ఆపి, దిగుతూ. "యేటిగురూ నాన్నచ్చిపోనానేటి, నడిసిపోతండావ్!" అన్నాడు.

"నువ్ వచ్చేదానికి ముందు యీ వూరు సావాల్రా. సింహాచలం!" అని బొరబొరా నవ్వాడు, కోదండం.

"యియ్యాల ఆటలో కూకోలేదేటి గురూ!"

"కూచుంటే యాభయ్ రూపాయల్దొబ్బినయ్. కైలాసంగాడికి వలభయ్ అప్పడ్డాను. యిచ్చి కదలమన్నాడు. చిర్రెత్తుకొచ్చి ఆణ్ణి నాలుగుతికి యాలా పైకొచ్చినా."

"యెక్క గురో పోదాం."

"యేటి గిరాకీ, నోస్లేవన్నా రాలేదయ్యేటిరా?" అంటూ రిక్షా యెక్కాడు కోదండం.

యెగిరి సీటుమీద కూచుని రిక్షా తొక్కుతూ, "కోడి పలవా తిందారేటి గురో?" అన్నాడు సింహాచలం.

"టీ నీళ్ళకి డబ్బుల్లేక నేనేడుస్తాంటే, పలావంట పలావ్!" బొర బొరా నవ్వాడు.

"పొరం కోడనుకుంతన్నావేటి గురో? యింటి పెట్ట. మొక మీ్మదకి పయిటికొంగేసుకుని; వోటిక్రీ నాగుండంటే నమ్మ గురో? మీసాలబాపు నాడ్జిలో యెట్టొచ్చిను."

"యింటి పెట్టా లేదు. నంశ పెట్టా లేదు, వల్లకుందరా. ఐనా యీ రోజుల్లో సానిముండలు సంసారల్లాగా వేషాలేసుకునీ స్తన్నారు."

"లేదు గురూ! కొత్త సరుకు. యెల్ట్రీ స్తంబం అవకడ సెట్టుపక్కాన నిలబడి పిలిపింది. యెక్కి కూచుని, యేదన్నా లాడ్జికి తీసికెలమంది. నానామాత్తరం కాసుకో లేనేటి! సందేఅం నేదు; కొత్త సరుకే. ఐదు రూపాయల్నాకీడానికి అచ్చుకునింది. మీసాల బాపుకి వది. మర్రైతే దబ్బయ్ రూపాయలకి రేటు తగ్గనంటి. సర్లె మ్మని యెనిమిదో నెంబరు గదిలో కూకోబెట్టి జగ్గారావుకాడి కెల్లీను. ఆడు నేడు. వుంటే ఆడ్ని తీసికెల్లి దింపేసి, ఐదు రూపాయ ల్నోటుతో సీసా సరుకుచ్చుకుందారనుకున్నాను. యేటి సెయ్యడవా అని ఆలోచిస్తా పీక్క తాగుతాంటే; నువ్వగుపిచ్చీవు గురూ! నీ జన్మలో అనాటి సరుకు సూసుండవు. యెదవ దబ్బయ్ రూపాయలు. యీయాల తగలేత్తాం, రేపు సంపాయిత్తాం-పోదారేటి గురో?"

కోదండం మనసు పీకసాగింది. సాలోచనగా బుర్ర కదుపుతూ, "జేబులో డబ్బులుంటే నువ్వడగాలంటరా నన్ను!" అన్నాడు.

"నీకేటి గురో, యెవడ్నడిగితే యియ్యడంట! గుర్రాజు సారా కేసులో సాచ్చికం యిచ్చావుగ! అడ్నడుగు."

"సాక్షిం పేరుమీద అప్పుడే నూటయాభయ్ దాకా గ్[illegible]జా నాడి దగ్గర. కాగా అదూళ్ళే లేదు."

"మరేటి సెయ్యటం-బేరం దొరక్కపోతే. మీసాల బావు గారు పది రూపాయలు, నన్ను కక్కమంటాడు—"

"సివంచలం-వోటి చేద్దాం—ముందు నన్నో దెబ్బేసుకో విచ్చి. జగ్గారావు యెక్కడుందీ చెప్తా. ఆలోగా అణ్నట్టుకొచ్చి తగిలించీద్దువు."

"దొంగసాచ్చికాలిచ్చిచ్చి నీదికోర్టుబుర్రైపోనాది గురో! సరే. వొప్పేసుకుంతాగానీ-నాకో రూపాయిచ్చి. వొంటో సత్తువగా నేదు. ముందో గళాసడితేగానీ కదల్లేను."

"నోటులుంటే యింకా లేన్దేంటి!" అని జేబులోంచి చిల్లర డబ్బులు తీసి. సింహాచలం చేతులో పోసి-జగ్గారావు యెక్కడ మఠం వేసిందీ చెప్పాడు. కోదండం.

లాడ్జి దగ్గిర రిక్షా ఆపి, "తిన్నగా యెల్లి నీ పన్జేసుకొచ్చి' కొత్త సరుకు. పైగా బెదురు గొడ్డునాగుంది. అదేటీ గొడవ సెయ్య నేదు. నేనొచ్చేదాకా యెల్లిపోమాక. కింద మీసాలబావుకో ముచ్చ ట్లెట్టు కూకునుండు" అని రిక్షా తిప్పుకు వెళ్ళిపోయాడు సింహాచలం.

సన్నగా యీలవేస్తూ మెట్లెక్కి తిన్నగా ఎనిమిదో నంబరు గది దగ్గిరికి వెళ్ళి తలుపులు నెట్టాడు. కోదండం. కాళ్ళు నేలమీకి ఆన్చి, మంచం అంచుమీద ఆలోచిస్తూ కూచుని వున్న సావిత్రి: తల పైకెత్తి చూసింది—యెదురుగా గుమ్మంలో తన భర్త కోదండం!

# అహల్య

యెదురుగా కనిపించే టీ కొట్లోకి, అప్పుడే వొచ్చిన రంగడి కూడా వొచ్చిన వాడి పెళ్ళాం మంగికేసి చూస్తూ, మధ్య మధ్యలో చిలుందమ్ము లాగుతున్నాను. "గురూ" అని చిట్టిగాడు అనటంతో వాడికేసి చూశాను. వాడు, అప్పటికి కాసేపట్నుంచి నన్ను ప్రత్యేకంగా గమనిస్తూ వుండివుండా లనిపించింది.

"యీ రంగడుగాడు-గురో-మంగి నెంటెట్టు కెప్పుడొచ్చినా ఆ జోగులుగాడు అళ్ళకి డబ్బు తీసుకోకుండానే టీ నీళ్ళొత్తాడు. గురో-యదయిన గొడ్డుకిమల్లే దానెంక సొంగ కారుత్తూ సూత్తాడు. యీళ్ళని సూత్తాంటే నాకేమనిపిత్తాందో తెల్సా గురో-మనిక్కూడా పెళ్ళాలుంటే టీనీళ్ళకి అవత్తదాల్సి రాకపోను గదాని...."

చిట్టిగాడు యేవేవిటో చెప్పుకుపోతున్నాడు. నా కవేవీ వినిపించటంలేదు. నా గుండెలో చెయ్యేసి కెలికినట్లయింది. భారంగా అనిపించింది.

"యేంటి గురో-అట్టా వుండావ్...."

తల విదిల్చి, నవ్వి, "చిట్టీ నీకో కథ చెప్పనా" అని నేనంటూండగా చిట్టిగాడు పక పకా నవ్వుతున్నాడు. చిలుం వాడికిచ్చి, "చిట్టిగా, యీ బైరాగి ముండాకొడుకు కథలేం చెప్పగలడని అనుకుంటున్నావ్ కదూ? లేదురా-యివ్వాళ కథ చెప్పగలను. యెందుకంటే, అది కట్టుకథ కాదు. నా సంగతి"—అని; సత్రవ మెట్లమీద అడుక్కొచ్చిన బియ్యం గ్రుటా గుమ్మరించి వేరు వేరుగా చేస్తున్న సత్తిరాజుకేసి చూస్తూ-

"అప్పుడు అది జరిగినప్పుడు ఆ ఐడియా వొచ్చిందని తెలవదు [illegible] కొకసారి చేస్తేం దనుకున్నావ్—యెప్పుడని? యీ [illegible] రాకముందు [illegible] వర్ల కోట [illegible] షావుకారు భద్రయ్యని

చంపటంలో పాలుపంచుకోక ముందు, దొంగసారా మొయ్యక ముందు. కాలేజీ అమ్మాయిల తార్పుడు పని చెయ్యక ముందు. జేబులు కొట్టడం మొదలెట్టక ముందు. తణుకులో కాయ్ రాజా కాయ్ నడపక ముందు. రాజమండ్రి జైలు సందర్శించుకోక ముందు— యేలూర్లో కలెక్టరాఫీసులో గుమాస్తాగా పనిచేస్తున్న రోజుల్లో సంగతి. యివన్నీ నీకు తెలిసినవే గాని నేను గుమస్తాగా వుండే వాణ్నని నీకు తెలవదు. యివన్నీ వొక యెత్తు: ఆ గుమస్తా జీవితం వొకటీ వొక యెత్తు.

వూళ్ళో వారం రోజులపాటు యేదో యెగ్జిబిషన్ పెట్టారు. అహల్య పోరు పెట్టగా: వొక రోజున తీసికెళ్ళాను. కొట్టు ముందు వేళ్ళాడదీసిన చీరలకేసి అహల్య చూస్తూ వుంటే. నేను కొంచెం అవతలగా నుంచుని పోయాను. అటునుంచి రఘురాంగారొస్తూంటే. "నమస్కారం సార్" అన్నాను. రఘురాం పిఠాపురంలో ఆర్డీవోగా పన్జేసి. యిక్కడికి కలెక్టరికి పి. యె. గా వొచ్చాడు. రఘురాం తల పంకించి అడుగు వెయ్యబోతూండగా—"యేవండీ యేవండీ" అంటూ సుడిగాలిలా వొచ్చిన అహల్య, నా పక్కన మరో వ్యక్తిని చూసి, ఆగిపోయింది. అతను అహల్యకేసి చూసి. "యేవ్వోయ్ సుబ్బారావ్. యెగ్జిబిషన్ చూడ్డానికొచ్చావా!" అన్నాడు సాదరంగా.

"అవున్సార్—" అని నేనేదో నప్తుంటే. అతను తన చూపులు నా మీంచి అహల్య మీదకి మరల్చి. 'యెవరు!' అన్నట్లుగా నాకేసి చూశాడు.

"యస్సార్, నా మిసెస్-చూడాలని ముచ్చటపడితే—" అని మిగతా మాటలు నోట్లోనే నాన్చాను.

"గుడ్!" అని ఛీర్ఫుల్‌గా అంటూ వెళ్ళిపోయాడు.

"యెవడు వాడు! యేదో చుట్టరికం వున్నట్లుగా చూస్తాడు నాకేసి!" అంది కోపంగా.

"చుట్టరికం లేకపోవటమేంటి. వాడి దగ్గిర పనిజేసే గుమాస్తా పెళ్ళానివి గదా నువ్వు!"

"మీ ఆఫీసరా!" అని ఆశ్చర్యంగా చూసింది. అందులో—

ఆఫీసరంతటివాడు తనకేసి ప్రత్యేకంగా చూపినందుకు తనకి యేదో తృప్తి కలిగినట్లు అనిపించింది. నాకు మండింది.

చీరా, జాకెట్టూ, నిక్కరు, బట్టా లాంటివెలాగూ కొనే ప్రసక్తి లేదు కాబట్టి.... రెండు అల్యూమినియం కూరగిన్నెలు, వక గరిటా లాంటివి కొనిపించాక.... అహల్యతో యింటికి చేరుకున్నాను.

అలా మా బీద గుమాస్తా దంపతుల్ని చూపిన రఘురాంకి, నేనంటే జాలి కలిగుండాలి. ఆఫీసుకి కాస్త ఆలస్యంగా వెళ్ళినా, వడ్డీకి డబ్బిచ్చినవాడు వొస్తే బయటికి వెళ్ళి వాడితో వొక గంటసేపు వేగొచ్చినా కరిచేవాడు కాదు. యింటి కేవో పైళ్ళు తెమ్మంటే, తీసు కెళ్ళినప్పుడు కాఫీ యిప్పించేవాడు. వొకసారి అడిగాడు, "నువ్వుం డేది యెక్కడోయ్!" అని. చెప్పాను. "అఁహఁ. ఆ వెనక వీధిలో కంట్రాక్టరు శంకరయ్య యింటికి అప్పుడప్పుడూ వొస్తూ వుంటాను. అటు ప్రక్కన నువ్వెప్పుడూ కనిపించలేదు. కనిపిస్తే, మీ యింట్లో కాఫీ తాగిపోయేవాణ్ణి సుమా!" అని, సన్నగా నవ్వాడు. "అంత దయ వుండాలేగానీ-యీసారి-తమరు దయచేస్తే నా భాగ్యంగా భావిస్తాను" అని అన్నాను. "వూఁ, రేపు ఆదివారం సాయంత్రం శంకరయ్య రమ్మని యిన్‌వైట్ చేశాడు. వీలైతే వాపసులో ఒస్తాలే...." అని అన్నాడు.

ఆ ఆదివారం సాయంత్రం యేడు గంటలకి వొచ్చాడు. అహల్య అందించిన కాఫీ తాగుతూ, "మీ ఆవిడ కాఫీ బ్రహ్మాండంగా చేస్తుందోయ్!" అని మెచ్చుకున్నాడు.

చింపిరి జుట్టుతో, చిరుగుల మురికి బట్టల్తో లోవ కొచ్చిన నాలుగేళ్ళ మా అబ్బాయినీ, రెండేళ్ళ అమ్మాయినీ చూసి__వెళ్ళ బోతూ, గుమ్మం దాటాక, "యేఁవిటోయ్ సుబ్బారావు, పిల్లల్ని మరీ అంత అధ్వానంగా పెంచుతున్నావేంటి!" అన్నాడు. అప్పటికి, "యేవఁని చెప్పేది సార్" అని వూరుకున్నాను గానీ-తరవాత; ఆర్నెల్లు నేను జబ్బు పడినప్పుడైన రెండువేల అప్పుమీద పెరిగే వడ్డీ, నెలలో చివరి పదిహేన్రోజులూ యెలా గడపాల్సి వొచ్చేది చెప్పాను.

ఆ తరవాత ఒక రోజు తను వూరికి వెళ్ళబోతూ, బ్యాంకు

చెక్కు యిచ్చి క్యాష చేసుకు రమ్మన్నాడు. తెచ్చి యిచ్చాక, అందు లోంచి రెండు వందరూపాయల నోట్లు తీసి నాకిచ్చి, "కన్నందుకు- పిల్లలకి కాస్త శుభ్రమైన బట్టలైనా కుట్టించకపోతే నేరమోయ్. వుంచు, తరవాత తీర్చుకుందువులే" అన్నాడు. ఆ డబ్బుతో పిల్లలకి తలా రెండు జతలు, అహల్యకి రెండు మంచి చీరలు, నాకో ప్యాంటూ షర్టూ తీశాను.

రెండు నెలలు గడిచాక. జనవరి ఫస్టున సాయంత్రం ఒచ్చాడు. "హేపీ న్యూ యియరోయ్ సుబ్బారావ్. మనం(వందరం కొత్త సంవత్సరంలో కులాసాగా కొత్త జీవితం ప్రారంభిద్దాం" అని గల గలా నవ్వాడు. నేనూ పళ్ళికిలించాను.

అంతలో అహల్య కాఫీ తీసుకొచ్చింది. అసలే బహు అందంగా వుంటుండేదేమో, ఆ కొత్త చీరలో-యెలా వుందను కున్నావ్!

అహల్య కప్పు అందిస్తోంటే చెయ్యి చాపి, "యిదేవిటమ్మా కురుపూ—" అంటూ ఆమె ముంజేతిమీద లేచిన పొక్కు పక్కగా వేలు ఆన్చాడు. కప్పూ సాసరూ కిందపడి, కాఫీ చింది అతని తెల్లని వులెన్ ప్యాంటుమీద మరకలు పడ్డాయి. రవ్వంత తీక్షణంగా చూశాడు నాకేసి.

"వెధవ్వోటి చేతులూ నువ్వూ—ఛఛ," అని అహల్య మీద విరుచుకుపడ్డాను. "పోన్లేవోయ్." అని, అంతలోనే తడుపుకుంటూ "అరె, సిగరెట్స్ మర్చిపోయినట్లున్నాను" అన్నాడు. "తెప్పెందుకా నుండండి సార్" అని మావాణ్ణి పిలిచాను. "లేడు-ఆడుకోటాని కెళ్ళాడు" అంది అప్పటికే వంట గదిలోకి వెళ్ళిన అహల్య. "పర్లే దులే, వెడుతున్నాగా బజార్లో తీసుకుంటాను," అని అన్నాడు. "అయ్యో కాఫీ ఐనా యివ్వందే—నిమిషంలో తీసుకొస్తాను" అని గుమ్మంవైపు తిరుగుతుంటే, "యిదో, సుబ్బారావు-" అన్నాడు. వెనక్కి తిరిగాను. పది రూపాయల్నోటు తీసి, "గోల్డ్ ఫ్లేక్ తప్ప నడవదోయ్, మనకి. యీ వీధిలో దొరుకుతాయా?" అన్నాడు. "యెంతసేపు సార్, సెంటర్లో పట్టుకొస్తాను," అని వెళ్ళబోతూంటే,

"యిది పట్టుకెళ్ళవోయ్" అని నోటు యివ్వబోతుంటే, "యెందుకులే సార్-" అని అంటూనే తీసుకున్నాను. అవతలి గుమ్మంవైపు తిరిగి, "అహల్యా, నేను సిగరెట్లు తీసుకొస్తాను, ఆ లోగా కాఫీ చేసివ్వు బాబుగారికి," అని వడి వడిగా వెళ్ళిపోయాను.

మరో రెండు వారాల తరవాత, వో రోజు రాత్రి తొమ్మిది గంటలకి వొచ్చాడు. కాసేపు అవీ యివీ మాటలు. కాఫీ. అంతలో సీరియస్‌గా ఐపోయి- "యీ పూట మూడ్ బావులేదోయ్" అని దిగులుగా ముఖం పెట్టాడు.

"మీకేం లోటు సార్-" అన్నాను.

"అఫ్‌కోర్స్, నాకేం లోటుగానీ—వెధవది మూడ్ బావు లేదోయ్.... రెండు పెగ్గులు పుచ్చుకుంటే తప్ప-"

"తీసుకొచ్చేదా సార్-"

"వూఁ-వుఁ, కొనుక్కురానక్కర్లేదులే. కార్లో వుంటే, చూడు."

వెళ్ళి తీసుకొచ్చాను, కార్లోంచి. రెండు ప్లేట్ల బిరియాని తెప్పించమన్నాడు. వెళ్ళి, అదీ సోడాలూ తీసుకొచ్చాను.

కాస్త పుచ్చుకున్నాక, మాంచి జోరుగా మాట్లాడుతూ నన్నూ పుచ్చుకోమన్నాడు. అలవాటు లేదన్నాను. "పుడుతూ యే అలవాటూ వుండదోయ్, అవసరాన్నిబట్టి చాలా అలవరుచుకుంటాం. యిదేం చెయ్యదులే. జెస్టు ఫర్ కంపెనీస్ స్పేక్," అని ఒత్తిడిచేస్తే కాస్త పుచ్చుకున్నాను, భయం భయంగా. మరి కాస్త పోశాడు. కాదంటే-బాగోదని తాగేశాను. ఆ తరవాత నేనే పోశాను, తనకి. సగం పైగా నేనే ఖాళీచేశాను. యెప్పుడో సోలిపోయి-మెలుకువ వచ్చేసరికి లోన వంటగదిలో యేడుస్తున్నట్లుగా సన్నగా అహల్య గొంతు వినిపించింది. అప్పటికి మత్తు వదిలింది. పాపం, యిలాంటి జాతర అహల్యకి అనుభవంలో లేదు-అసహ్యంగా అనిపించిందేవోఁ- అనుకుంటూ లేచి వెళ్ళాను.

చీరా లోపావడా బ్లౌజూ-అహల్య ఒంటిమీద కుప్పలా పరుచు

కుని వున్నాయి. నేను రావటం చూసి కనురెప్పలు వాల్చింది. తరిక బయటి కురికింది.

మౌనంగా గదిలోకి వొచ్చి, కిందకి ఒరిగి, గచ్చుకేసి తల బాదుకుంటూంటే-నా బుష్షర్టు జేబులోంచి పదిరూపాయల నోట్లు నేల మీదకి జారాయి.

పాత అప్పులు తీర్చాను గానీ కొత్త అప్పులు మొదలయ్యాయి. అలవాట్లూ అవసరాలూ పెరిగాయి. నాలుగ్గదుల మంచి యిల్లు వంద రూపాయల అద్దెకి తీసుకున్నాను. యిందుకూ అందుకూ అన్నింటికీ అలవాటుపడ్డాను.

యెనిమిది నెలలకి రఘురాంకి అనంతపూర్ బదిలీ అయింది. వెళ్తూ రెండు మూడు నెలల్లో నాకు ప్రమోషన్ ఆర్డర్స్ వొస్తాయని చెప్పాడు. నాలుగు నెలలకి తెలిసింది నా కాన్ఫిడెన్షియల్ ఫైల్లో, యితనిది పై అధికారిని పతనం చెయ్యటానికి వుచ్చులువన్నే స్వభావం— అని రాసినట్లు.

అప్పటికే కలర్ మందూ, బజారు ఆడదీ, నేను మానుకోలేని అలవాట్లయ్యాయి. యింటి అద్దె, బట్టా, తిండీ ఖర్చూ పెరిగి...అప్పు పదివేల దాకా పెరిగింది.

ఆఫీసర్లంటే నాకు అసహ్యం వేసింది. కాగా, యే వెధవ ఎన్నాళ్ళుండేదీ తెలవదు. ఆఫీసుకు తిన్నగా వెళ్ళే అలవాటు తప్పి పోయి, పైలు వర్కు చూసి చాలాకాలమైపోయింది. కొత్తగా వొచ్చిన ఆఫీసరు కరవటం మొదలెట్టాడు. చెడామడా తిట్టేశాను. యేవేవో చార్జెస్ ఫ్రేంచేశాను. అది పుచ్చుకోకముందే, రాజీనామా కాగితం వాడి మొఖాన విసరి కొట్టాను.

మరెప్పుడూ ఆఫీసర్ల జోలికి పోలేదు. కంట్రాక్టరు శంకరయ్య మునిసిపల్ ఛైర్మన్ నరసయ్య- అప్పులు తీరతిపోయానా, ఐశ్వర్యం పెరుగుతూనే వుంది. మోటారు సైకిళ్ళు ఎందరికి లేవని, ఐనా నన్నొక్కణ్ణే, మోటారుసైకిల్ సుబ్బరావుగారూ - అని పిలుస్తారు అందరూ.

అహల్య, యింటిగుమ్మం దాటిగానీ, నాతో మాట్లాడిగానీ చాలా కాలం అయింది. యిల్లోనే ఏకాంగా వుండే వంటమనిషి

పనిమనిషి అన్ని పనులూ చూసుకుంటారు. నేను రాత్రుప్పు యింటి కొచ్చే సరికి మూడో నాలుగో అవుతూ వుంటుంది. మనసు పుడితే అహల్య గదిలోకి వెళ్తాను. నిద్రపోతూ వుంటుంది. వొంటిన వుంటే. చీర జరిపి ఆమె మీద చోటుచేసుకుంటాను. మెలుకువవొచ్చినా. రానట్లే వుండిపోతుంది. యెప్పుడైనా రెప్పలు విప్పుతుంది. పేలగా సన్నగా బలహీనంగా చప్పుడు చెయ్యని దరహాసరేఖ- అప్పుడైతే నాశ్వాసలోంచి వొచ్చే విస్కీ- వేడికి కరిగిపోయేదేగానీ. యిప్పు డెప్పుడైనా గుర్తుకొస్తే ఆనాడు భద్రయ్య గుండెలో దిగిన చురకత్తి కంటే పదునుగా నా నరనరంలోంచీ చీరుకుపోతున్నట్లు, నాలోకి దిగబడుతుంది.

పదిహేను రూపాయలకి చీర తెస్తే; పొంగిపోయి నా మెడ చుట్టూ చేతులువేసి నన్నుక్కిరి బిక్కిరి చేసే అహల్య- టిష్యూ చీర తెస్తే, కిందివాడికి పనికిరాదని రూఢిగా తెలిసిన పేకముక్కను పారేసినంత లాఘవంగా లైట్‌గా. చూపుడూ బొటనావేళ్ళతో యెత్తి బల్లమీధకి జార్చేది. యిప్పుడనిపిస్తుంది- అలా తను యెత్తిపారే సిందీ తీసిపారేసిందీ నన్నేనని. గుర్తొచ్చినప్పుడు- ఆ అపహాస్యం. కురుపులా సలుపుతుంది.

ఒకరాత్రి ఎప్పటిలాగే మూడున్నర తరవాత వొచ్చి మనసు పుట్టి. తనగదిలోకి వెళ్ళాను. మంచంమీదకి జరుగుతూంటే. కళ్ళు తెరిచి. 'వొద్దు' అన్నట్టుగా చేత్తో ఆపింది. కొత్తలో సీట్ పుచ్చు కుంటే గొంతు కాలినట్లు. నాకు గుండె మండిందనుకో. కళ్ళతో తీక్షణంగా చూశాను. 'ప్లీజ్' - అని చూపు మరల్చింది, 'యేం, కథ?' అన్నాను. 'ప్లీజ్- నాకు జ్వరంగా వుంది. అని అంది. 'యేం అర్ధరాత్రిదాకా వుండెళ్ళిన ఆ వెధవపైతే జ్వరం లేదా?' అన్నాను.

అంతలో ధభీమని వెనక్కి విరుచుకు పడ్డాను. యెత్తి, నా ఛాతీ మీద బలంగా తన్నిన తన కాలు పరుపుమీద ఆన్చి, లేచి కూచుంది.

అప్పుడు నావంక తను చూసిన చూపు యీ గుంటూరు కారం కంటె ఎర్రగా మంటగా వుంది. ఆ మంటకి నాకు మరింత

మందుకొచ్చి, "హోపి బోకు లంజా-" అంటూ లేవబోయాను. చెంగున మంచం మీంచి గెంతి, నా ఛాతీమీద కాలువేసి నొక్కింది.

మొదట్లో రఘురాం విషయంలో మూర్ఖంగా మర్రతనం పోతే మందుకొచ్చి నాలుగుతికితే చచ్చినట్లు నోరు మూసుకుని పడివుండిన ఆ అహల్య! ఏం తోచక, యేవీ స్ఫురించక, దిగ్భ్రమగా అలా విశ్లేష్టంగా చూస్తూ వుండిపోయాను.

"నాకుజ్వరంలేదు జలుబులేదు రోగంలేదు రొష్టులేదు విచారం లేదు ఆకలిలేదు ఆవేదనలేదు ఆరోగ్యంలేదు ఆనందంలేదు కోపంలేదు కరుణలేదు కాఠిన్యం లేదు దీనత్వం లేదు బాధ లేదు సుఖం లేదు మనసు లేదు చొళ్ళు లేదు చీమూ నెత్తురూ లేదు సిగ్గుశరపూ లేదు నీతినియమమూ లేదు మొగుడూ లేదు పిల్లల్లేరు పీడులేదు వాడు లేడు-తెల్లటి శరీరం వుంది- తులం యింతకి అని అమ్ముతాను కొంటావా కొనగలవా చెప్పు- తియ్ వెయ్ రూపాయలు తీసి యిలా పారెయ్. కుక్కలా నీకింద పడుకుంటాను. ఎందుకు? ఆ వెయ్యి రూపాయలూ నీ ముఖాన కొట్టటానికి నీ పేకాటకి నీ తాగుడికి నీ ముండలకి తగలెయ్యటానికి - నీదగ్గిర నోరెత్తకుండా ఎందుకు పడి వున్నానో తెలుసా. నాబిడ్డలకోసం - కాని యీ వాతావరణంలో పెరుగుతున్న ఆ బిడ్డలు నీకంటే ఘనులు కాగలరనీ నా చెయ్యి దాటిపోయారనీ యిప్పుడిప్పుడే తెలుస్తోంది- యెవర్రా లంజ? నేనే లంజనైతే నువ్వు బజార్లో అడుక్కుతింటూ ఏనాడో కుక్కకంటే హీనంగా చచ్చుందువు. యీ యిల్లూ యీ సామానూ యీ నగలూ బట్టలూ యీ పిల్లలూ నీ అప్పులూ-అన్నీ నీయే- నేనుతప్ప- నువ్వే నువ్వే-నిన్ను కుక్కా- అని పిలిస్తే ఖిన్న కుక్క నిలువునా కుంచించుకు పోతుందిరా- డాఫర్ లోఫర్-నువ్వేనువ్వే- నువ్వు లంజకివిరా- కుక్కా పందీ చుంచూ ఎలకా నక్కా పురుగూ కుమ్మరిపురుగూ పేడపురుగూ ముట్టుబట్టా........"

ఆ మాటల వుప్పెనలో మునిగిపోయిన నేను, ఆమె యిల్లు విడిచి వెళ్ళటం గమనించలేదు.

# నీలవేణి

నీలవేణి, యీ సూపర్ బజార్ వుద్యోగంలో ఆర్నెల్లనాడు చేరింది.

అప్పటికీ యిప్పటికీ మీగడ రంగులో వున్న రబ్బరు బొమ్మలా కనిపిస్తుంది. తను చేరిన వారం రోజుల తరవాత వొక రోజున మా యిద్దరికీ ప్రక్కా ప్రక్కానే డ్యూటీ పడింది. సందర్భం చూసుకుని మాట కలిపాను— రొచ్చు బుద్ధితో వంకర్లు తిరిగిపోలేదు; సిగ్గు లేకుండా విల్లులా వెనక్కి విరుచుకోనూలేదు. సాఫీగా. సాదాగా. చక్కా మాటాడింది.

వో నల్ల మేక, ఎఱ్ఱబూచి, బోడావు, మినీ సైజు ఒంటె, చీపురు పుల్ల, జోడు రబ్బరోళ్ళు, గాలి తీసిన బెలూన్లతో నిండిన యీ విజయక్రిష్ణా సూపర్ మార్కెట్లో. నీలవేణి అపశ్రుతిలా అనిపిస్తుంది. ఆ చట్రంలో యిమడదు. కాన్వెంట్ చదువు చదివి యే యెయిర్‌లైన్స్ ఆఫీసులోనో రిసెప్షనిస్టుగా వుండాల్సిన వ్యక్తి.

అందమూ, ఆకర్షణ— రెంటిలో యే వొకటో ఐతే కొంతలో కొంత మేలుగా వుండేదేమో గానీ, రెండూ వుండటంవల్ల అలాంటి చోట వుద్యోగం చెయ్యటం బహు కష్టంగా అవుతుండేది. వో రోజున డాల్స్ కౌంటర్ దగ్గిర డ్యూటీలో వుండగా యిద్దరొచ్చారు. బొమ్మ గుమ్ముగా వుందిరా అని రెండో వాడితో అంటూ, నీలవేణి వెనక కేస్‌లో వున్న బొమ్మ గురించి అడుగుతున్నట్లు ఆమెకేసి చూపుతో సూచిస్తూ, "అదెంత?" అన్నాడు. పదిహేను రూపాయలని చెప్పింది. "రోజుకెంత?" అన్నాడు వాడు. కొరకొరా చూసింది. "అద్దెకివ్వరా!" అన్నాడు రెండోవాడు. "సారీ రాంగ్ నెంబర్. అదా లైబ్రరీలో అమ్ముతారు ఆ బొమ్మల పుస్తకాలు."- వెళ్ళిపోయారు. అవతల [illegible]ర్లో దగ్గిరున్న ఆడవాళ్ళు హాయిగా నవ్వుకుని ఆనందిస్తున్నారు. ఆసాం[illegible] — [illegible]ళ్ళలా కాక [illegible]మూలు వాయిల్ చీరలే

కట్టినా అంతిదిగా కనిపిస్తోంచే. మందుకొచ్చి! ఆవాళ రాత్రి డ్యూటీ నుంచి దిగి యిళ్ళకి పోయే దడబిడలో అందరూ వుండగా— నీల వేణి ప్రక్క వరండాలో మూలగా నుంచుని వుండటం కనిపించింది. దగ్గిరికి వెళ్ళాను. నేను రావటం చూపి, తడబాటుగా కళ్ళతడి కాటోలు తుడుచుకుంది.

"రకరకాల బుద్ధులున్నవాళ్ళు వస్తుంటారు. వాళ్ళ మాటలు మనం పట్టించుకోకూడదు," అన్నాను.

టొటటొటా కన్నీళ్ళు రాలాయి.

"సారీ"

కళ్ళు తుడుచుకుని, పేలగా నవ్వింది.

"వాళ్ళ మాట అటుంచి తోటి వుద్యోగివిలు—"

"వాళ్ళ లాగా మీరు లేకపోతే అంతే." అన్నాను. ఒక నిమిషం మౌనంగా వుండి, "నా వాలకపు ప్రవర్తనా చెడుగా కని పిస్తుందా?" అంది. "ప్రవర్తన కాదు. రూపం—" అందంగా వున్న నేరానికన్నట్లు తల వొంచుకుంది.

ఒక రోజున నీలవేణీ నేనూ వాకే కౌంటర్ దగ్గర డ్యూటీ చేస్తున్నాం. యిద్దరు స్టూడెంట్ కుర్రాళ్ళొచ్చారు. పువ్వుల డిజైన్ జార్జెట్ చీర చించి కుట్టించుకున్న గురూ షర్టులో వొకడు. మడత మంచం పట్టాలాంటి బట్టతో కుట్టిన బెల్‌బాటంలో వొకడు—చీకేపిన తాటికాయల్లా బుర్రలు....

మాకేసి చూపి, "లక్కీగై" అన్నాడు రెండోవాడితో. "ఓ వారం కాలేజీ మానేసి దీనిలో వుద్యోగం చెయ్యాలని పిస్తోందిరా బ్రదర్." అన్నాడు రెండోవాడు.

తందా(వన్నంత కోపం వచ్చింది నాకు. ఆ పైన వాళ్ళింకేం వాక్కుండా వెళ్ళిపోయారు. లేకపోతే, వాళ్ళతో దెబ్బలాటకి దిగాలని పించింది.

వో సోమవారం నాడు నీలవేణి డ్యూటీకిరాలేదు. ఆ మరనటి రోజూ రాలేదు. సెలవు పెట్టినట్లు తెలిసింది. ఆ సాయంత్రం నీల వేణి దగ్గిరికి బయల్దేరాను. ఆ కొద్ది పరిచయంతో నీలవేణ నాకెంతో

ఆత్మీయంగా అనిపించింది. హుందాగా, వినమ్రంగా ప్రవర్తించే నీల వేణిని చూడకపోతే మనసు ఆరాట పడుతూ వుండేది. యిష్టపడితే పెండ్లి చేసుకోవాలని అప్పట్లో గట్టిగానే అనుకున్నాను గానీ, తరవాత తరవాత అంతగా అనుకున్నానని అనుకోను. సూపర్ బజార్‌కి ప్రక్క వీధిలో రెండు గదుల చిన్న పోర్షనులో వంటరిగా వుంటుంది నీలవేణి. తన వివరాలు ప్రత్యేకించి చెప్పేది కాదు. నేను అడగనూ లేకపోయాను.

మంచం మీద నీరసంగా పడుకునుంది. జ్వరంట. నన్ను చూసి పేలగా నవ్వినట్లే అనిపించిందిగానీ, నేను వెళ్ళినందుకు సంతోషించిందని నా కనిపించలేదు. శొంఠి కషాయమూ, గట్రా యేదో పుచ్చుకుందిట. డాక్టర్ని తీసుకువస్తానన్నాను. వొద్దంది. కాసేపు మౌనంగా వుండిపోయాను. వెళ్ళొస్తానని లేచాను. "మంచిది" అంది.

"మీ అభిమానానికి థాంక్స్" అని అనడంతో రవంతగా నొచ్చుకున్నాను. ఐనా బజారు వెళ్ళి, టెట్రాసైక్లిన్ హైడ్రో క్లోరైడ్ ఫార్ములా మచ్చిక మాత్రలు, పది అరడజను బత్తాయిలు, ద్రాక్ష తీసుకుని మళ్ళీ వెళ్ళాను.

అవన్నీ చూసి, "మీరిలా చేస్తారనుకోలేదు." అంది, కొంచెం కటువుగా. "తప్పుగా భావిస్తే క్షమించండి." అన్నాను. "తప్పని కాదుగానీ—" అని దిండు కింద నుంచి పదిరూపాయల నోటు తీసి యిచ్చింది. వద్దన్నాను. "తెచ్చినందుకు థాంక్స్, డబ్బు తీసుకోకపోతే యివి ముట్టుకోను.'' అంది నిష్కర్షగా. తీసుకున్నాను.

వారం రోజులకి తగ్గింది. రోజు విడిచి రోజు వెళ్ళేవాణ్ణి, ఆపీ యిపీ తీసుకుని.

సూపర్ బజార్లో మాతోపాటు పనిచేసే వెంకట్రావూ, కేదారేశ్వరుడూ మా యిద్దరి వంక వెకిలిగా నవ్వుతూ చూస్తోంటే మండుకొచ్చి— ఒకసారి యేదో మిష మీద వాళ్ళతో దెబ్బలాటకి సిద్ధపడ్డాను. మా యిద్దర్నీ గురించీ యేదో ఆకాశరామన్న వుత్తరం రాశారు సెక్రటరీకి. అది వాళ్ళిద్దరి పనే అని నా అనుమానం.

విజయ

ఆ తరవాత ఒకటి రెండుసార్లు, నీలవేణి యింటికి వెళ్ళాను. కాఫీ కాసి చ్చేది. పెద్దగా మాట్లాడేది కాదు, అ మాట్లాడే మూడు నాలుగు మాటల్లోంచే, నాకెంతో ఆత్మీయత, అభిమానం, అనురాగం అనుభూతికొచ్చేవి.

మరోసారి, మేమిద్దరం ఒకే కౌంటర్‌లో డ్యూటీ చేస్తున్నాం. యిద్దరొచ్చారు. పి. యు. సి. మూడుసార్లు తప్పి, తండ్రులు సంపాదించిన డబ్బుతో కంట్రాక్టులు చేస్తున్న మొహాల్లా కనిపించారు టాయిలెట్ సామాను లిస్టు యిచ్చారు. నీలవేణీ నేనూ రేకుల్లోంచి అవి తీసిస్తున్నాం, వెనక్కి తిరిగి.

"నను రతపకుండానే లేఖిపోయింది—" సన్నగా అన్నాడొకడు. "నీకెలా తెలుసు?" అన్నాడు రెండోవాడు, జాలీగా. "యిన్‌ట్యూషనోయ్." అన్నాడు.

'నాకు వెర్రి కోపం వచ్చింది- సామాను తియ్యటం ఆపి. ముందుకి తిరిగి. "యేంటీ" అన్నాను తీవ్రంగా. "మిమ్మల్నేవంరే మన్నారు. మైన్డ్ యువర్ బిజినెస్." ధీమాగా అన్నాడు మీసాల లేనివకుడు. చరచరా అక్కణ్ణుంచి వెళ్ళిపోయాను. అరగంట తరవాత తిరిగొచ్చాను.

నీలవేణి ఆ రోజంతా నాతో యేం మాట్లాడలేదు. మౌనంగా తన పని చేసుకుంటూ పోయింది. డ్యూటీ ముగించాక వెళ్ళబోతూ, "నా కూడా డ్యూటీ పడకుండా చూసుకోండి" హీన స్వరంతో అని తల తిప్పేసుకుని చకచకా వెళ్ళిపోయింది. నేనెంత ఫూల్‌లాగా ప్రవర్తించిందీ— ఆ రాత్రికి వంటరిగా పడుకుని ఆలోచిందుకుంటే అర్థమైంది.

ఒక రోజున నీలవేణీ నో రుబ్బురోలూ, కిరాణా సెక్షన్‌లో వున్నారు. యెందుకో వెళ్ళాను. "కిస్‌మిస్- యివాళ రేటెంత?"- అన్నాడు అక్కడ నుంచున్న వ్యక్తి. కోపంగా వాడికేసి చూసింది నీలవేణి. వాడికి వెనకగా వున్న నేను, ఎవడా వీడు— అని ప్రక్కకి జరిగి చూశాను. కమర్షియల్ టాక్సాఫీసర్ రామచంద్రం.

పకపకా నవ్వుతూ. "కిస్‌మిస్ రేటు రోజు రోజూ మార దండీ, యెంతిమ్మంటారు?" అని సరసంగా అడిగింది డబ్బురోలు. వుకూ్కా వుకూ్కా. అని దగ్గినట్లుగా నవ్వుతూ. "అరకిలో కట్ట వమ్మా." అన్నాడు.

ఆ రోజు సాయంత్రం వీధిలో నడుస్తూ. "మీరీ వుద్యోగం మానెయ్యండి." అన్నాను. "భుక్తి?" అంది. మౌనంగా వీధి చివర వరకూ నడిచి యెవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయాం.

నెల రోజుల తరవాత ఒకనాడు పెద్ద గొడవైంది. సంక్రాం తికి ముందు రోజు. బాగా రద్దీగా వుంది. నీలవేణి నాకు నాలుగు కౌంటర్ల అవతల వుంది. యెవడికో, వస్తువులు కవర్లో వేసి బల్ల మీద పెడుతూంటే, ప్యాకెట్ తీసుకోబోతున్నట్లుగా చెయ్యి పట్టు కున్నాడు. చెంప మీద వూచి కొట్టింది. వాడు పెద్దగా అరుస్తూ యిల్లి పీకి పందిరేస్తూంటే మేనేజరు వచ్చాడు.

"యీభయ్యే. రాత్రికి క్లోజ్ చేసి వెళ్ళే వేళకి రండి"- అని అడుగుతూంది. ఛీ ఛీ. డీసెంట్ ప్లేస్ అనుకుని వచ్చాను." అని చెబుతున్నాడు మేనేజర్‌తో. "వుయ్ ఆల్వేస్ కీప్ డీసెంట్ పీపుల్- యేదో అపార్థం చేసుకునుంటారు. సరే. సారీ—" అని సర్ది చెప్పి పంపేశాడు.

"గొడవలు రాకుండా చూసుకోవడం కూడా డ్యూటీలో భాగమే" అని నీలవేణితో కటువుగా అన్నాడు, మేనేజరు. నీలవేణి కళ్ళు ఎర్రగా మండుతున్నాయి. మబ్బూ మూగిన వాళ్ళతో "మీ డ్యూటీ చూసుకోండి." అని వెళ్ళిపోయాడు.

అదే రోజు సాయంత్రం. వో యిద్దరు కుర్రాళ్ళు వస్తూ నీలవేణి వున్న వైపుకి కనుబొమ్మలు ఎగరేస్తూ నా దగ్గరికి వచ్చారు. వాళ్ళడిగిన బ్లేడ్లూ, సేష్టూ గట్రా తీస్తున్నాను.

"అది పెద్ద చెయ్యిరోయ్- నా కెట్టా తెలుసనా- తణుకులో మా పరంధామ్మావయ్య కంట్రాక్టులు చేస్తుండేవారు. ఆయన్ని బాగా

గొరిగింది- అదంతా పెద్ద కథలే, తరవాత చెప్తాను."

పరుకులు తీసి బిల్ల మీద పెడుతూ కొరకొరా చూశాను.

"ప్రేమలో పళ్ళేదు గదా" అని స్వగతంలా పలికి- ప్యాకెట్ అందుకుంటూ, "మీరుండేది మా పేటలోనే అనుకుంటాను. యింకా లోతుకు దిగేముందు నన్నొకసారి కలవండి___" అని వడి వడిగా వెళ్ళిపోయాడు. వాడి కూడా వున్న వాడు నాకేసి జాలిగా చూస్తూ కదిలాడు.

మరో రోజున నీలవేణికీ వెంకట్రావుకీ పెద్ద గొడవైంది. సెలవు పెట్టి మధ్యాహ్నమే వెళ్ళిపోయింది. సాయంత్రం యింటికి వెళ్ళాను. చాలా సేపు మౌనంగా వుండిపోయాం.

"మీరీ వుద్యోగం మానెయ్యండి-" అన్నాను.

"మానేసి?" అంది.

"మీరు యిష్టపడితే నా అదృష్టంగా భావించి పెళ్ళి చేసుకుంటాను." అని అనాలని ఎన్ని సార్లో, అదివరకు అనుకున్న నేను మౌనంగా వుండిపోయాను.

లేచి వెళ్ళి కాఫీ చేసి తీసుకొచ్చింది. తాగకుండా తలొంచుకుని కూచున్నాను.

రెన్నిమిషాలయ్యాక, "చెయ్యి మారిన అడదీ, చల్లారిన కాఫీ పనికిరావంటారు- త్వరగా తాగండి." అని; నవ్వింది.

కప్పు తీసుకుని తాగుతూ, "ఆ వెంకట్రావు నీచుడు" అన్నాను. ఆ మాట- వాడు నీచుడవటం నా తప్పు అని అంటున్నట్లుగా ధ్వనించింది.

"నేను దేని గురించీ బాధపడటం లేదు.- మీ రిదవకండి." అంది.

మరి కాసేపు మౌనంగా కూర్చుని వొచ్చేశాను.

ఆ మరుసటి రోజున, నీలవేణి డ్యూటీకి రాలేదు. ఆ మరుసటి రోజూ రాలేదు. సెలవూ పెట్టలేదు. నాలుగో రోజు వెళ్ళాను, సాయంత్రం యేడున్నరకి. తలుపు తట్టిన పదినిమిషాలకి తెరుచుకుంది.

తలస్నానం చేసినట్లుంది. జుట్టు భుజాల మీంచి వెనకగా వేళ్ళాడుతోంది. తెల్ల వాయిల్ చీర; ఎర్రంచు. తెల్ల బ్లౌజు.

నవ్వుతూ, "రండి" అంది. కుర్చీలో కూచున్నాను.

"బాగున్నారా?" అంది.

"మీరు రావటం లేదు?" అన్నాను.

"మానెయ్యకున్నారుగా?" అంది. "మానేశారా?"

"మానెయ్యొద్దంటారా?"

మౌనంగా వుండిపోయాను.

"చెప్పరేం?"

"అబ్బే—మానేసి—ఎందుకు—మానెయ్యండి."

గలగలా నవ్వి "కాఫీ తీసుకొస్తానుండండి." అంటూ లోన గదిలోకి వెడుతోంది-వొత్తుగా కండా, గుండ్రటి వంపులు-వాటి కూడా నేనూ లోనకి వెళ్ళాను. కాళ్ళ సవ్వడికి ఉలిక్కిపడినట్లుగా వెనక్కి చూసి,-పేలగా నవ్వి-

నాకే మనాలో తోచక, "మీరు కాఫీ పెర్కొలేటర్ లో కాస్తారో ఫిల్టర్లో-" అని ఆగిపోయాను.

"పెర్కొలేటర్ లో తయారు చెయ్యగలిగితే, పెర్కొలేటర్స్ అమ్మే ఆ సేల్స్‌గర్ల్ నౌకరీ దేనికి?"

కిరోసిన్ స్టౌ వెలిగిస్తూ, "అలా ఆ పీట వాల్చుకు కూచోండి, మెల్లాగా ఎలా వంట గూట్లోకి చొరబడ్డారు కాబట్టి." అంది.

నేను నిలుచునే వుండిపోయాను.

నీళ్ళగిన్నె స్టౌ మీద పెట్టి, వెనక్కి తిరిగి, పీట వాల్చి "కూర్చోండి" అంది.

కూర్చున్నాను. కాఫీ చక్కెరా డబ్బాలు తెచ్చి స్టౌ ముందు కూచుంది.

మోకాళ్ళ మీద గడ్డం కొస ఆన్చి నీలం మంటలోకి చూస్తూ వుండిపోయాను.

రెండు కప్పులు కాఫీ కలిపి ప్రక్కకి తిరిగి, ఒక కప్పు నా ముందుకు జరిపింది. బరువుగా తొణికిన స్తనాల కేసి చూస్తూ, వంగి కప్పు తీసుకోబోతూ-మరింత వంగి ఆమె భుజాల మీద చేతులు వేశాను. ఆ బరువుకి వెనక్కి వాలింది. ఆమె కాలు తగిలి కప్పు ఎగిరిపడి రెండో కప్పుకి తగిలి-రెండు కప్పులూ నేల మీద దొర్లాయి.

నమ్మలేనట్లుగా నా వంక చూసి, అంతలోనే కోపంగా చూస్తూ, "డోన్ట్ బి ఎ ఫూల్." అంది.

తన మీదకి ఒరుగుతున్న నాకేసి అసహనంగా చూస్తూ, "యివ్వాళేమైంది మీకు, మతి చెడిన వాడిలాగా-"

ఆమె మీదకి పూర్తిగా ఒరిగి-

పెనుగులాడుతోంది. ఆమె ఛాతి మీద నా నుదురు అదిమి. కోడి పెట్టని నోట కరుచుకున్న నక్కలా ఆమెని చేతులో పట్టేశాను.

* * *

పావుగంట తరువాత, "క్షమించండి" అన్నాను తలవంచుకుని.

"దేనికి?" అంది.

నేను మాట్లాడలేదు.

"నన్ను పెళ్ళి చేసుకోండి, క్షమిస్తాను." నవ్వీ నవ్వనట్లుగా నవ్వింది నవ్వడి.

నేను మాట్లాడలేదు.

"మాట్లాడరేం?"

"నేను-నేనసలు పెళ్ళి చేసుకోను. పెళ్ళంటూ చేసుకుంటే-మరెవర్నీ చేసుకోను. క్షమించండి."

"దేనికో చెప్పనిదే క్షమించటం ఎలా?"

ఒక నిమిషం మౌనం.

"మిమ్మల్ని-మిమ్మల్ని, చెరిచినందుకు."

పక పకా నవ్వి. "నేనంటే మీకు ఇష్టం, జాలి. బిచ్చగాణ్ణి చూసి జాలిపడిన వుడత యేం చెయ్యగలదో మీరూ అంతే. నన్ను మీరు చెరచలేదు. చెరచలేరు. ఆ సంగతి మీకు తెలుసు. ఎవరు గానీ నన్ను చెరచగలిగిన స్థితే ఐతే, మీరు చెరచాల్సిన అవసరమే కలిగేదికాదు, పెళ్ళిచేసుకునేవారు. వస్తా. ఈ వుడత ప్రపంచానికీ, యీ తోడేళ్ళ ప్రపంచానికీ శాశ్వతంగా గుడ్ బై." అని, చిరిగిన బ్లౌజు తీసేసి నా మీదకి విసిరి వడివడిగా పెరట్లోకి వెళ్ళిపోయింది. నేను తలవంచుకుని ముందుగదిలోంచి బయటకు నడిచాను.

# నిప్పువుండు

నా పేరు లీల.

నీలం టర్కీ టవల్ కప్పుకుని నిలుచున్నా: కెంపులు పొదిగిన పాలరాతి శిల్పాన్ని. పడమటి దేశాలనుంచి అక్రమ రవాణా ఐన రక రకాల పరిమళ ద్రవ్యాలూ, సబ్బు పొడులతో నింపిన, పోలిథీన్ స్నానాల తొట్టిలో గంటసేపు విహరించి వచ్చి అద్దంముందు నిలు చున్నాను.

నిలువెత్తు అద్దం. దానికంటె నునుపుగా మెరుపుగా పాలరాయి గచ్చు.

నీలంరంగు బాత్ రోబ్ విప్పి పక్కకి విసిరాను. నా వొంటి మెరుపుకి అద్దాలూ నేలా మెరిశాయి. నా నగ్నరూపు ఎలా వుంటుం దంటే-ఉహుఁ చెప్పను. చెప్పకపోవటం నా తప్పు కాదు. వెయ్యి నుంచి ఐదువేల దాకా ఒక్క రాత్రిలో తగలెయ్యగల స్తోమతా, ఇలా మీకున్నదీ లేనిదీ తెలీదు, మరి!

కస్తూరి, మృగమదం, చందనం, రకరకాల పుష్పాల పరిమళాల సారం లాంటి వెన్నో కలిపి తయారు చేసిన పరి మళం-ఈ పరిమళం బజార్లో దొరకదు. ప్రత్యేకం సొంతంగా తయారించుకున్న పరిమళ ద్రవ్యం-స్ప్రేయర్‌తో ఒళ్ళంతా చిలక రించాను. ఒంటి వేడికి ఆవిరై ఒంటికి యింకిపోయింది.

ముస్తాబు బల్లముందు కూచున్నాను- ఫౌన్డేషన్ క్రీములూ, లోషన్లూ, పౌడర్లూ, రంగులూ- ముస్తాబు ముగించాను. ఎరుపో, పసుపో, తెలుపో, నీలమో-ఏదో సరిగా చెప్పలేని రంగుచీర, నైలాన్‌లాంటి రబ్బరు, రబ్బరులాంటి నైలాన్ చీర-ఒంటి రంగుకో

కలిసే లో పాపనా అంటే, ఏ రంగుదో మీకు తెలియుననుకుంటాను. వెన్నెలతో సానబట్టిన మీగడలాంటి మెరిసే మీగడ రంగు.

చెవుల మీంచి దువ్వి, ముచ్చైన గుండన పిగచుట్టి లేచాను. నేను ఖరీదైన ఆకదాన్ని; ఒంటరి ఆకదాన్ని.

ఈ మహాలులోని సామానూ గట్రా ఏలాంటివో మీరూహించు కోలేకపోతే మీకు తెలిపే అవకాశంలేదు. చెప్పే తీరికా, వోపికా, అసక్తీ నాకు లేవు.

అద్దం ముందు నిలబడి నాకేసి చూసి నవ్వాను. 'నవ్వాననే అన్నావా? అందరూ నవ్వేది నవ్వు ఐతే నేను నవ్వేది నవ్వు కాదు. నే నసలు నవ్వను. నా దసలు నవ్వుకాదు ఇంద్రజాలిక లీలాలోలితా చంచరీకం. అది అందరికీ సాధ్యం కాదు. బ్రహ్మవిద్యకు మించిన మహద్విద్య అది. చాలా ఖరీదైంది కూడా- అది చెప్పనక్కరలేదను కుంటాను.

పన్నెండు కావస్తోంది. కోర్టుకి హాజరవ్వాలి. డిప్యూటీ పోలీస్ కమీషనర్ అల్లంరెడ్డి కొరివితో తల గోక్కున్నాడు. అంటే, నన్ను కోర్టుకి రప్పిస్తున్నాడు అని అర్థం. వెధవ చాలా పొగరుగా మాట్లాడాడు. నేను పొగరుగా మాట్లాడతాను. మగవాడెవడూ పొగరుగా మాట్లాడకూడదు, ముందుగా అందుకు నేను అనుమతిస్తే తప్ప. ఆ దున్న వెధవని, యీ లెంపా ఆ లెంపా మాటల్తో వాయించాను, ఎడాపెడా. ఆ కసి మనసున పెట్టుగుని నామీద కేసు పెట్టించాడు. పెర్పస్‌లో స్నేహితుల్తో కలిసి టేబుల్ ముందు కూచుని వుండగా- అనుమానాస్పదప్రవర్తనకట. ఆ యస్పైని గుంజాను. సీటు నవి లాడు. సాక్ష్యానికి ఇద్దరు కాలేజి కుర్రాళ్ళని వేసుకున్నాడు. చూస్తేనే తెలుస్తుంది. పెర్పస్ ఆవరణలో కూడా ఎన్నడూ కాలుపెట్టని, పెట్ట లేని మొహాలవి. ఆ కుర్రాళ్ళను పిలిచి పిసరంత నవ్వు చిందించాను. మంచు ముక్కల్లా కరిగి నీళ్ళైపోయారు. చెయ్యి తాకించలేదు గానీ, తగిలితే ఆవిరై పోను. పెర్పస్‌లో మీరు నన్నారోజునగానీ మరెప్పు డైనా గానీ చూశారా అని అడిగితే, లేదని ఒప్పుకున్నారు. యస్పై

అందులో ఒకడికి బాస. రెండోవాడు వీడి స్నేహితుడు. అలా చెప్పాం కదా. యిప్పుడెలాగా-అన్నారు. మా లాయర్ని పిలిచాను. మీరు అబద్ధం చెప్పినట్లు మళ్ళీ చెప్పక్కరలేదు. నేను వేసే ప్రశ్నలకి నేను చెప్పినట్లు కోర్టులో జవాబివ్వండి అని వాళ్ళకి రెండు గంటలు కోచింగ్ యిచ్చాడు చిన్న.

వచ్చి కోర్టు ఆవరణలో దిగాను. పడవకార్లూ, పలకకార్లూ, గుడిసెకార్లూ, బొర్రకార్లూ-ఆవరణలో కార్లు ఆక్రమించుకోగా మిగిలిన స్థలం బహు కొద్ది. అవన్నీ నాకు బాగా పరిచయమైన కార్లు. దూరంనుంచి నాకేసి చూస్తూ చొంగ కార్చుకుంటూ తృప్తిపడే కార్లు కొన్ని. కార్లులేని మనుషులు నా మనుషుల లిస్టులో లేని మనుషుల-వాళ్ళు చేరారు.

పన్నెండింటికి జడ్జి తీర్పు చెప్పాడు-కేసు కొట్టేశాడు. అప్పుడు డిప్యూటీ పోలీస్ కమీషనర్ అల్లంరెడ్డి ముఖం ఎలాగుందంటే మరెలాగూ లేదు. సున్నం పూసిన ఇటికలాగున్నాడు.

ఇంటి కొచ్చి పోలీసు కమీషనర్‌కి ఫోన్‌చేసి చెప్పాను. మునిలాడు కాంగ్రాట్స్ మీద కంగ్రాట్స్ చెప్పాడు. వీడు నా ఫ్రెండ్. నా చుట్టూ తిరిగే వాళ్ళంతా నా ఫ్రెండ్సే. అలాకాని ఫ్రెండ్సంటారా-అలా కాని వాడు ఫ్రెండెలాగవుతాడు? లీలా నిఘంటువులో ఫ్రెండంటే అర్థం, అలాగనే వుంది.

*　　　　*　　　　*

ఈ లీలామహల్ ఎలాగుంటుందంటే మీ ముత్తాత ముండల కిందా తాగుడుకిందా జారొదులుకున్న పాత రాజ ప్రాసాదం లాగుంటుంది. యీ బంజారాహిల్స్‌లో దిగబడి మనకమనకగా కనిపిస్తుంది. మీకంతే కనిపిస్తుంది. అది కాదు లీలామహల్-లోన చూస్తే తెలుస్తుంది. కలో నిజమో తెలీక, తల తిరిగి, అసలు బంజారాహిల్స్ నేవే లేవనేస్తారు.

మీ దగ్గిర వోట్లడుక్కోటానికొచ్చిన మినిష్టరుడి అనాటి ముఖం కనపట్టంలేదేమో అని కాలుగాలిన పిల్లిలా తిరక్కండి-ఆ అసలు ముఖం చూడాలంటే; మీ పిల్లల పాలడబ్బాలు భూగృహంలో దాచేసి, కొసరి కొసరి పదిరెట్ల ధరకి అమ్మే ఆ అదృశ్య హస్తం ముఖం ఎలాగుండేదీ చూడాలంటే; మీ బుర్రకి రాసుకునే కొబ్బరి నూనె, పోపుపెట్టుకునే శనగనూనె, నాలిక్కి రాసుకునే చింతపండూ గర్రా బంగారం వంటున ఎందుకు మండిపోతున్నదీ తెలుసుకోవాలంటే మీ యినపెట్టెలోని వజ్రాల హారం దోచుకుపోయిన ఆ ముసుగు మనిషి ముఖం ఎలాగుంటుందో తెలుసుకోవాలంటే. యీడొచ్చిన మీ అమ్మాయి ల్నెత్తుకు పోయి ఏ బొంబాయిలోనో బేరా పరక్కి అమ్మేసిన వాడి మొగుడి ముఖం చూడాలంటే, ఆఖరికి, మీ ముఖాలు ఎందుకు దరిద్రంతో ఛండాలంగా జిడ్డోడుతున్నదీ తెలుసుకోవాలనుకున్నా - యీ లీలామహల్లో అడుగిడితే చాలు.

మీకు లీల గురించి తెలీదు. ఈ మహల్లో కాలిడిన వాళ్ళకి తెలీదు, అసలు లీలగురించి. అసలు లీలను నేను కాదు. నేనసలు లీలని కాదు. అంచేత నా గురించి మీకు తెలీదు. తెలియాలంటే యీ మహల్లోని ఏ వస్తువును కదిలించినా చెబుతుంది-వాటి భాష మీ కర్థమయ్యే పక్షంలో.

కొట్టుకోవటం ఏనాడో మానేసిన నా గుండెకి బదులుగా, కొట్టుకునే ఈ గోడ గడియారం, టిక్కూ టిక్కూ కొట్టుకునే-టిక్కూ టిక్కూ టిక్కూ టిక్కూ టిక్కూ టిక్కూ టిక్కూ టిక్కూ కొట్టుకునే టిక్కూటి క్కూటిక్కూ టిక్కూటి క్కూ.... చెరుగ్గడ చక్కెరగా మారటంలోంచి పిగబడిన పిప్పిలాగా, విశ్వ సృజనీయ కొండలోంచి దిగజారిన మొనాటనీ అంతా గడ్డకట్టి టిక్కూ టిక్కూ టిక్కూ టిక్కూ - దాన్ని చూసి మరి నా గుండె కాయని చూడక్కరలేదు.

నేను కంటతడి పెడతానంటే, అంతకంటే మించిన పెద్ద జోక్ వుండదు. కామిక్ జోక్. కాదంటే, ఏ చిన్నిలాల్‌నో, సలాం ఖాన్నో, హరిపర్షాద్‌నో, పేరిశాస్త్రినో, రంగారెడ్డినో, వెంకయ్య

చావకిరినో, అప్పారావునో, శతకోటి లింగాన్నో అడిగి చూడండి- నవ్వీ నవ్వీ పొట్టచెక్కలయ్యేట్టు కంట తడెట్టుకుంటూ నవ్వీ నవ్వీ నవ్వీ చస్తారు. చావకపోతే నేను చచ్చూరుకుంటాను.

అప్పుడప్పుడు అవసరానికి నేనేడవటం వాళ్ళకి తెలుసు. నేనేడిస్తే ఎంత రమ్యంగా వుండేదీ మీకు తెలీదు, వాళ్ళకి తెలుసు. నా కంట రాలే నీలా లేరుకుందికి గంటల తరబడీ ఎదురుచూస్తూ కూచుంటారు. నొప్పకుండా కింద కరెన్సీనోట్ల కట్ట లేసుకూచుని ఏడుస్తూ కూచుని ఏరుతుంటూ ఏడుస్తూ కూచుని నవ్వుతుంటారు. అవి నీలాలూ కావు, కన్నీళ్ళూ కావు. బంగారు బొట్లు. ఆ బొట్లు చప్పరించి, అవి విషంగా మారగా మూలుగుతూ వాల్చి, నవ్వుతూ చప్పరిస్తూ ఏడుస్తూ నవ్వుతూ మూలుగుతూ....

లోన గదిలో వేరే మంచం మీద దిండు పట్టుకుంటే రాలే పుప్పొడిలోంచి ఆవిరైన కన్నీరు- ఏ వేసవజామునో. వర దొచ్చి అంతా కొట్టుకుపోయిన పొద్దుటిపూట ప్రిదిలిన నిర్లిప్తతలాంటి ఏకాంతపు ఘడియలో తడిబారటానిక్కూడా ఓపికలేని కళ్ళు-ఎప్పటికీ వున్న చోటునుంచి కదల్లేని, రోజ్ పెయింట్ పూసుకున్న గోడల్లాంటి కళ్ళచూపుల కళ్ళు—

ఏ హృదయాన్నీ కదిలించలేక, ఏ జీవితాన్నీ చిగురింపించలేక, ఏ సంసారాన్నీ నిలపలేక, ఏ అనురాగాన్నీ జాల్వారింపించలేక-కపకొద్దీ నమస్తాన్నీ కళావికలంగా కదలదోసే వున్మాదశక్తిలా-

ఎప్పుడైనా ఓ మంచుగుండె జాల్వారబోతే, కరుడు గట్టిన కాఠిన్యంలాంటి గతం అందుకూ కాకుండానే చేస్తుంది. గెలుపులోని ఓటమి నరనరంలో ప్రవహించగా-ఓటమిని గెలవలేకపోయిన నేను-సాహిత్యపు ముసుగులో దూరి—

నిజంగా నాక్కావాల్సింది దొరకనిది. దొరికింది అక్కరలేనిది- దొరికింది అక్కరలేదని, అక్కరలేనిది దొరికిందని, దొరికిందాన్ని దొరికించుకుని....

నాకు చిక్కకుండా వుండాలేగానీ. చిక్కినవాడు ఎప్పటికీ చిక్కిపోయే వుంటాడు. గవర్నమెంటు సెక్రటరీ రాజారావూ చిక్కాడు. కాలికింద చెప్పులా పడుంటాడు. ఇంకెక్కడి రాజారావు-నా గుంజుడికి గాను అంచాలు పట్టీ పట్టీ పట్టుబడిపోయాడు. చిప్ప చేతికొచ్చింది. వాడికంతే కావాలి. కానీ వాడి పెళ్ళాం-పాపం, దాని కిప్పుడు కన్నవాడు లేడు. కట్టుకున్నవాడూ లేడు. అది నా లోకానికి చిహ్నం-నేనేం చేసేది!

భుజంగంవూ లేడు, భోగేశ్వర్రావూ లేడు, చిదంబరంవూ లేడు. అందర్నీ కాళ కాలగర్భంలో కలిపేసి నేనున్నాను. నేను న్నాను. వుండి—

టిక్కూ టిక్కూ-గడియారం గుండె కొట్టుకుంటూనే వుంటుంది. అది ఆగదు. దానికి జలుబూ జ్వరంవూ లేవు. రోగంవూ రొష్టూ లేవు. అన్ని రోగాలనూ యిముడ్చుకుంటునే. గుండె. గడియారమవుతుంది; గడియారం. గుండె అవుతుంది. అది యంత్రం. గుండె గడియారం గడియారం గుండె. అది ఆగదు. టిక్కూ టిక్కూ టిక్కూ టిక్కూ టిక్కూటి క్కూటిక్కూ టిక్కూటి క్కూటిక్కూ టి—

గంగమ్మ పిలుపుకి ఉల్కిపడ్డాను. గుమ్మం అవతల వెలుగులో నిలబడి నా చీకటి గదిలోకి చూస్తోంది— "గా కొత్త పోర దొచ్చిండు."

లేచి మీట నొక్కాను. లైటు వెలిగింది. యంత్రం కదా, మీట నొక్కితే చాలు: మనసు వెలుగుతుంది. పొళ్ళు పొంగుతుంది, గుండె పలుకుతుంది, వెన్నెల చిందుతుంది, చిరునవ్వు జాల్వారు తుంది. మీట, మీట నొక్కితే. మీట మీట. మీట నొక్కు మీటనొక్కు, నొక్కు నొక్కు నొక్కు, నా కొడుకుల్లారా నొక్కండి మరి నొక్కండి మీట మీట మీట మీట మీట—

యీ కొత్త గుంటడు దొంగల ముఠా నాయకుడి యంగ్ అసిస్టెంట్ లాగున్నాడు. క్యామెలాల్‌తో త్రీయేసెస్‌లో కూచుని

షాంపేను పుచ్చుకుంటూంటే వచ్చి పరిచయం చేసుకున్నాడు నెల్లాళ్ళ నాడు. వీడి చేతులో రూపాయి విలువ మరీ పడిపోయింది. వచ్చి నోటుకీ పది పైసల బిళ్ళకీ తేడా గమనించనివాడు. యే బెజవాడ లోనో, నకిలీ నోట్ల రింగ్‌లీడర్‌కి రథ సారథిలాగా వున్నట్టు న్నాడు. వ్యాపారం పందెం గుర్రంలా పోతున్నట్లుంది. అసలీ నోట్లు నా మీద గుమ్మరిస్తున్నాడు- యెప్పుడో పట్టుబడితే, గళ్ళబనీనూ పట్టలాగుతో యే ఆరేళ్ళకో జెయిల్లోంచి బయటికొస్తాడు. వీడమ్మ కడుపుకాలా, మహా పోటుగాడు, ప్రాణం కడదుతుంది వీడితో-

సోఫాలో ఏటవాలుగా జారి, వుంగరాలుగా సిగరెట్ పొగ వదుల్తున్నాడు.

"యేంరా బాబూ, వేళకానివేళ యిలా వచ్చావ్!" అంటూ వెళ్ళాను.

"మనమెప్పుడొస్తే అప్పుడే వేళ." అని కాలు మీద కాలు వేసుకుని మహాదర్జా వెలగబోస్తున్నాడు.

"వోరి నీ శీవి మండా- నిన్నేదో, పోలీసులట్టుకు పోయారని నేననుకుంటూంటే-"

"యింత వ్యాపారం నడుపుతున్న నిన్నట్టుకుపోవి పోలీసోడు- వన్నెందు కట్టుకు పోతాడని!"

"యేమో, యే గుడంబా కేసులోనే దొరికిపోయ-"

"ఛా, నీబోట్టి చిల్లర బుద్ధి- మనది పెద్ద బిజినెస్‌లే. అయ్యన్నీ మీసాల్రాక ముందు మిణికానే గానీ-"

"దొంగనోట్ల బిజినెసే అనూ- ఐతే!"

"నోసి నీయమ్మా. అవులిస్తే పేగులెక్కెడతావు గదే. మహ్వా!"

"అనిలించకపోతే లెక్కెట్టలేనా!"

"మూత్తేనే లెక్కెట్టగలవు. అయ్యన్నీ యిప్పుడెందుగ్గానీ- పొద్దుట్నుంచి వొక్క ముక్కన్నా యేసుకోటాని కీల్లేక పోయింది- కానీ తొరగా___

"ఓరే కిష్టుడూ-"

"చహా. యేంటా పిలవటం, నీకెన్ని సార్లు శెప్పాన్నేను, నన్నట్టా పిలవొద్దని-ముద్దు ముద్దుగా, క్రిష్టా-అని నవ్వుతూ-"

"వూఁ. నవ్వితే-"

"రతనాలేతుకుందారని."

"రత్నాలు కాదు. పళ్ళు."

"పళ్ళే. దానిమ్మ గింజలంటి పళ్ళు."

"దేనమ్మ గింజలేరితే యెవతూరు కుంటుందోయ్,క్రిష్టా!"

"నువ్వే."

"అయ్యో. నీ చేతులు కందేను క్రిష్టా, మాట మాత్రం తెలిస్తే నేనే యేరి నీ వడిలో పోసుకోక పోదునా అని అన్నదట, వెనకటికో సత్యకాలపు మధురానగరి గోవాముద్ద! ఆ రోజులు___

"వోర్నీ బలేగన్నావ్ లే-" బిగ్గరగా అరిచాడు.

"వోరి ప్రముగం వెధవా-" అనుకుంటూ, "బాగా అలిసిపోయి వట్లున్నావ్. క్రిష్టా." అన్నాను.

రసగుల్లాల్లాంటి గలగలా రాలే మాటలు, మంచు బిందువు ల్లాంటి పన్నీటి మాటలు-యేవి కావాలనుకుంటే అవి, మీట నొక్కితే చాలు-

"యేంటా జూపు?"

మీట మీట మీట. నొక్కు. మెత్తని కత్తి మొనలాంటి చూపులు, కాంతిరేఖ లాంటి చూపులు, యింద్రచాపం లాంటి చూపులు- యేవంటే అవి; మీట నొక్కితే చాలు.

భువనైక మోహనంగా నవ్వి. "యేం పుచ్చుకుంటావ్ పీటర్ స్కాటా. సిక్స్టీ నైనా?" అన్నాను.

"చిక్ట్బినైనే."

గంగమ్మని పిలిచి చెప్పాను. తెచ్చి అన్నీ అమర్చింది. మొదటిసారి గ్లాసులు ఖాళీ చేసి. వాడి గ్లాసొక్కటే నింపాను. "పోసుకో. నీ కెక్కినట్లులేదు." అన్నాడు.

"నాకెప్పుడూ యెక్కే వుంటుంది."

కిర్ కిర్ మని నవ్వుతూ, "జాణలంజకి మల్లే మాట్లాడ్తున్నావే" అన్నాడు.

"జాణవీ నెరజాణవీ లంజవీ, పిరి లంజవీ, కాదవీ. యెవడా అనే వెధవ, యాలా వక్రాట-వాణ్ని. యీ విస్కీ గ్లాసులో ముంచి చంపేస్తాను."

"హోల్సైల్ గా మాటనుకో. పోయ్. ఆంకో గ్లాసోయ్, యింకా అన్లా."

"తానంతటదే యెలా అన్తుందిరా కుర్రనాగన్నా, అనిపించ కుండానే."

"యెవడు కుర్ర నాగన్న? నే నీన్నె మొగుణ్ణి-నువ్వు నా గుంట ముండవి."

మీట మీట మీట-నొక్కితే, కుడి యెడమవుతుంది. అటు వయసిటవుతుంది. అఘాటున చూస్తే నాకు అన్నలాగా కనిపిస్తాడు. పరీక్షగా చూస్తే యేన్నర్థం చిన్నగా వుంటాడు. ఇంద్రజాలికం వయసెంత? నిజంగా నాకెన్నేళ్లో చెబితే, వీడు అపళంగా గుండె ఆగి పోయి చస్తాడు. సలభయ్ మూడేళ్ళకి ప్రౌఢత్వం కోల్పోని ఇంద్ర జాలికపు పడుచుదనాన్ని. నా వంట్లోకి యెక్కించిన యీస్ట్రోజెన్ యెంతో వీళ్ళకేం తెలుసు?

"తప్పుడు నాకొడకా-యెవర్రా నీ ముండ? నువ్వే నా ముండవి."

"యస్సో యస్సో. నేన్నీ ముండవి. యెగ్రీడు. ఒప్పేసుకున్నాం. మరిగంటే__"

"నీ మొఖం. నాలగ్గ్లాసులకే తూలిపోతున్నావ్. పోయి మంచం మీద తొంగో."

"నేన్నీకాడే తొంగుంటా."

"నాకాడకాక మరెక్కడన్నా తొంగుంటే, నేనే వూరుకోను. పద. నడువ్."

"యిమానం పట్టా, యెక్కేసి మంచం మీద వాల్తాను."

"నీ మొఖానికి విమానం కూడానా-మోకాళ్ళ రధమెక్కి నడువు."

"చెయ్యన్నా అందివ్వు."

చెయ్యి అందించి, "పడి చచ్చేవ్. తాకొస్తుంది చావు. యిలా యిలా భుజం మీద తల ఆన్చి. నడుం మీంచి చెయ్యి చుట్టి-" అని- "మనసులు వేరైనా మన తనువొకటేలే-లే-లే-" అంటూ నడిపించుకెళ్ళి మంచం మీదకి తోశాను.

ముప్పావుగంట గడిచింది. వున్నవాడున్నట్లుగా బిగదీసుకుపోయాడు. లేచి ఒంటికి బట్టలు చుట్టుకుని వాడికేసి-నాకు పరమ అసహ్యం, వీళ్ళ కేసి చూడటానికి. నాలోకి నేను చొరబడిపోయా. నా ఒళ్ళు వీళ్ళకప్పగించి-అంతే, వీళ్ళకేసి చూడాల్సిన అవసరం నాకు లేదు.

అంతలో ఉండలు చుట్టుకుపోతూ నరకయాతన పడుతున్నాడు. దుప్పటి విప్పి వాడి మీదకి విసిరి, "యేవైంది?" అన్నాను

"నెప్పి."

"ఎక్కడ? ఏం నొప్పి?"

"కడుపు నెప్పి. నాలుగైదునెల్లకెప్పుడన్నా వొస్తుంది-అబ్బా, వూఁ-అమ్మా-"

భుజం మీద చెయ్యి వేశాను. "యేదన్నా మందు-పోనీ డాక్టర్లని పిలవమంటావా?" అన్నాను.

"అక్కర్లా. కాసేపటికి అదే తగ్గుతుంది. డాక్టర్లకిది అంతు చిక్కనే లేదసలు. అమ్మా-వూఁ-అమ్మా-యిక్కడ-పొట్ట మీద చెయ్యేసి నొక్కిపట్టు."

వెల్లకిలా తిప్పి పొట్టమీద చెయ్యి వేసి నొక్కాను. దుప్పట్లోకి యింకుతున్న చెమట, నా చేతికి అంటుతోంది. కళ్ళు మూసుకుని ముఖం బిగబట్టి-బాధ ఓర్చుకోటానికి ప్రయత్నిస్తున్నాడు.

ఐదు నిమిషాలకి, కొస్త తగ్గినట్లుంది, ముఖం కాస్త సాఫీగా ఉంది. చెయ్యి తీసేశాను.

"చెమట" గొణిగినట్లుగా అని, దుప్పటి పక్కకి లాగేశాడు. నేను పక్కకి తిరగబోతూండగా, తళుక్కున మెరిసిన మచ్చ. పొత్తి కడుపు మీద పచ్చని పుట్టుమచ్చ-యాభయ్ పైసలబిళ్ళంత పుట్టుమచ్చ. మచ్చ మచ్చ- మోహన్ ఒంటి మీది మచ్చ-క్రిష్ణమోహన్ ఒంటి మీది మచ్చ-నా చేతుల్తో కడిగి స్నానింపించిన మచ్చ-మచ్చ మచ్చ జీవిత- మచ్చ మచ్చ మచ్చ జీవితం జీవితం జీవితం మచ్చ మచ్చ మచ్చ మచ్చ జీవితపు మచ్చలాంటి అలాంటి మచ్చలాంటి, మచ్చ లాంటి మచ్చ-

వడివడిగా వొచ్చి సోఫాలో వెల్లకిలా ఒరిగి, తల, పై అంచు మీద ఆన్చాను.

వెధవగాడిద, మచ్చగాడిద, రోగంమచ్చలగాడిద. ప్రతి గాడిదా యేదో ఒక స్మృతిని రేపే మచ్చే - మచ్చ - అందంగా పచ్చగా తెల్లటి ఒంటి మీద - నా రక్తం పంచుకు పుట్టిన నా బాబు ఒంటి మీది అందాల మచ్చ-యే బాబు కోసమైతే ఎన్ని భరించానో ఆ బాబూదక్కలేదు. మగవాడి నైచ్యానికి బలిఐపోయిన-

ఆ నైచ్యంలో నైచ్యం ఐపోతూంటే. గుండె రాయి చేసుకుని
బంధనాలు తెంచుకుని-మచ్చ మచ్చ-మళ్ళీ వీడి మచ్చ కళ్ళ ముందు-
తాగుబోతు వెధవ, ఖూనీకోరు వెధవ. దొంగ సారా దొంగనోట్ల
దొంగలంజల దొంగ వెధవ, వెధవ మచ్చ మచ్చ మచ్చ వెధవ-

"లీలా." పిలుపు విని తుళ్ళిపడి లేచాను.

ప్యాంటు బిగించుకుని మంచం అంచు మీద కూచునివున్నాడు.
వాడి కేసి చూశాను. వాడి ముఖంలోనూ మచ్చే. మచ్చ మచ్చ-
వాడే మచ్చ-వీడి మొహం మండా-మండిన మచ్చ మచ్చమండి
మండి మండిన మచ్చ మచ్చ మచ్చ-

"తగ్గిపోయింది లీలా."

కత్తి అంచులాంటి విషపుకాంతిరేఖ నా మనసులోంచి
దూసుకుపోయింది. వడివడిగా అడుగులు వేస్తూ సోఫాలో ఒరిగి
పోయాను.

"ఏమిటి, ఏమైంది?" అంటూ వచ్చి నా పక్కన కూర్చు
న్నాడు.

మీట మీట మీట నొక్కు మీట, లీల మీట. మీటలీల
లీలలీ. లలీల లీలలీ. మీట మీటమీటమీట మీటమీట మీట, నొక్కు-
లీల, మీటనొక్కు. మీట లీల మీట-

"ఏం లేదు క్రిష్ణా, తమాషాకి," అంటూ లేచి కూర్చుని,
మధురంగా నవ్వాను.

"హోఫ్!" అంటూ నా భుజం మీద చెయ్యి వేశాడు.

వాడి ముఖంలోకి చూసేటంతలోనే నా చూపు మళ్ళీ వాలి
పోయింది. కన్న కడుపు దౌర్భాగ్యంలా కుప్పకూలిన చూపు.

రెండు నిమిషాలు గడిచాయి.

గుండె మీద చెయ్యి వేసుకుని, "వీడవలేవూరు, క్రిష్ణా?" అన్నాడు.

"అన్నాళ్ళా నాయే."

"మీ అమ్మా నాన్నా-"

"అదో కెదవ నాకొడుకంట. అదో కెదవ లంజంట. అళ్ళ సంగతి నాకు తెలవదు. నేన్నేనేగానీ, యేంటి కత, అమాకి లాగు తున్నావ్, పట్టిస్తావేంటి చెప్పు!" అని బొర బొరా నవ్వాడు.

మచ్చ మచ్చ, ఆ మచ్చ-అది ఆ మచ్చే అని ఆ మచ్చ చేశే అనిపించను. అసలు ఆ మచ్చ అది కాదు. అది మచ్చే కాదు, కాదు లేదు, మచ్చ మచ్చ, కాదు కాదు-

"వే పోతా, నాకో అరిజెంటు పనుంది మరి. బెమ్మాండంపైన ముద్దొకటి పెట్టు. మరి పోవాలింక," అని, నన్ను దగ్గరికి లాక్కో బోయాడు.

దూరంగా జరుగుతూ, "క్రిష్ణా కలుసుకుంటే, యీ సారి పెడతా గానీ యిప్పటికి వెళ్ళిపో." అన్నాను.

"పోపి నీ నకరాలకేంగానీ-"

నా పాషాణపు హృదిలో దిగబడిన వెన్నబాకు.

"ప్లీజ్. యీ ఒక్కసారికీ వూరుకో." అని, లేవబోయాను.

లేవనివ్వకుండా పట్టుకుని ముద్దు పెట్టుకోబోయాడు. చాచి చెంప మీద కొట్టాను.

దిమ్మెరపోయా, "వోసి నీయమ్మా తిక్కలంజా-" అని రుసరుస లాడుకుంటూ బయటికి వెళ్ళిపోయాడు.

*    *    *

యీ ప్రపంచం పట్ల నాకున్న కసి తీర్చుకోవాలని. వాళ్ళని నా తళుకు బెళుకులతో నేర్పుతో పూరించి, వాళ్ళ ఒంటిని రోగాలతో కుళ్ళబెట్టి, వాళ్ళ మనసును చెదలై తిని, జలగలా వాళ్ళ దబ్బు పీల్చి-

నిప్పునై మండి మండి వాళ్ళని దగ్ధం చేశాను. పుండునై సలిపి సలిపి వాళ్ళని కుళ్ళబెట్టాను. ఐనా నేనోడిపోయాను. వాళ్ళకి చావు లేదు.

తలొంచుకు వెళిపోతున్నాను. జీవితం. తాదాత్మ్యపు వైరుధ్యం.

సంఘంలో ఘరానాగా చలామణీ అయ్యే పెద్దమనుషుల నిజ రూపాలను బయటపెట్టి వాళ్ళ పరువు తీయాలని ఎన్నో పేజీలు రాశాను, రాస్తున్నాను.

యిప్పుడు అవన్నీ బయట పెట్టకుండా అర్ధాంతరంగా వెళ్ళక తప్పనిసరి ఐంది. నా తరవాత వాటిని వెలికి తీసి అచ్చువెయ్యండి. అవి ఎక్కడ దాచానంటారా? వాటిని వెలికి తీసే అర్హత వున్న వ్యక్తికి అవి ఎలాగా కనిపిస్తాయి. ఐనా చెబుతాను. వాటిని ఎక్కడ దాచిందీ- యీ గుండెలో- అది ఎండిన కన్నీటి పేటిక.

పవిత్రతా నీతిలేని లోకంలో అపవిత్రతలోంచి అవినీతిలోంచి అసహాయంగా అపహాస్యంగా జీవించాను.

కసి తీర్చుకోవటం కోసం, నేను యేవి పోగొట్టుకోవాల్సి వొచ్చిందో—అనే ఎందుకనుకోవాలి—నేను అభిమానంతో దయా

సాగరంవై. అనురాగజలధి ఐ పొంగిన రోజున దాన్ని నాకు దక్క నివ్వలేదు, యీ ప్రపంచం. ఈ ప్రపంచాన్ని నేను క్షమించలేను. చచ్చినా క్షమించను. యింత కాలం చస్తూనే క్షమించకుండా వుండి పోయాను. ఈ రోజున, నన్నావరించిన బలహీనత కారణంగా బ్రతికిపోతున్నాను.

ఈ ఆస్తి—ఈ బటాచోర ప్రభుత్వానికి దఖలు పరచలేను- స్త్రీ సంక్షేమం పేరిట తాగేస్తుంది. అనాధశరణాలయాల కిమ్మంటారా? వుహూ, యివ్వను- వాటికి అండగా నిలిచే గుంటనక్కలు తినేస్తాయి. మరెవరికీ యివ్వను—వాళ్ళకి దాని లేదు.

అంచేత, ఈ ఆస్తంతా మరేమీ చెయ్యొద్దు. ఈ మహలు ఎవరో రాసినట్లు, పడగొట్టండోయ్.... రాయి రాయి విడగొట్టండి. ఈ రాళ్ళు కలపా,నగలూ కరెన్సీ నోట్లూ, తళుకు బట్టలూ-సమస్తం నా శవం మీద పేర్చి గుట్టపోసి నిప్పంటించండి.

వాళ్ళెవరికీ నా అనేదేదీ యివ్వలేదు. ఎవరికిచ్చానో వాళ్ళు పుచ్చుకోలేదు. నేను నేనుగానే వుండిపోయిన దైన్యతని.

యింక ఈ చిటికెనవేలి వజ్రపుటుంగరం మింగిన మరు క్షణాన.

"మూయండి నా వెనుక విశ్వపు తలుపు."

—: సమాప్తం :—

# సమర్పణ

(మొదటి పేజీల తరువాయి)

ఆ లైంగికవాంఛే అరుణని రాఘవ్‌తో లేపుకొచ్చింది. పట్టణ జీవితం, చాలీ చాలని జీతం, వుండీ వుండని రాఘవ్ వుద్యోగం అరుణకి చాలా నేర్పాయి. పేదరికాన్ని మురికిని కష్టాల్ని కడిగేయాలని కాలుజారింది. ఫలితం చేతికంది నోటికి చేరేలోగా పుట్టిన వాడే తన్నుకు పోయాడు. మిగిలింది తనకు తనే.

శేషావతారం పంచితనం, అరుణని గృహిణి సావిత్రిగా మార్చింది. కళ్ళనిండా పళ్ళ బిగువుతో తొక్కిపట్టిన కన్నీళ్ళు, పమిటక్రింద బలిపిన పాలిండ్లు, చావు బ్రతుకుల మధ్య తటపటాయిస్తూ ప్రాణం - కొడుకూ, [illegible] మగడూ. సలసల కాగే జ్వరంలో బిగుసుకుపోయి తెలగుడ్లు వేసిన కొడుకు వొంటిమీద పడలేక పడిన కన్నీటి బొట్లు, యాదెందుకూ పనికిరాదన్నట్లు, ఆవిరై ఎగిరి పోతుంది. సావిత్రి తెగించి లాడ్జి కెక్కింది. తీరా తారపిల్లింది మొగుడే.

తరవాత దశ అహల్య. గుమాస్తా మొగుడు రెండుటికి ఆఫీసర్‌కి తగిలించి పాని సంసారిగా మారిస్తే పిల్లలకోసం అన్నీ చంపుకుని సరిపుచ్చుకుంటోంది అహల్య. అదే సంతానం పెడదార్ల పడితే. మగడి దున్నపోతు శృంగారంతో భరించలేక మొఖాన వూపి గడప దాటి స్వతంత్రిస్తుంది.

బజారెక్కిన నీలవేణికి సూపర్ బజార్‌ల్లో వుద్యోగం భుక్తి. బుద్ధి పెంచుకోవటం మాని, బొచ్చు పెంచుకున్న ప్రతి తలకి మాపిన

యువకుడూ వరసమాడుకో చూసే సేల్స్ గర్ల్. పబ్బం గడుపుకోవటానికి పరిచయం పెంచుకుని వీలు చిక్కడంతోనే యెంగిలి చేసిన తోటి వుద్యోగిని 'క్షమించ'లేక లీలగా కొత్త అవతారం ఎత్తుతుంది. ఎందర్నో ముంచిన తన 'యింద్రజాలిక లీలా లోలితా చంచరీకం'లో తనే మునుగుతుంది. కన్న కొడుకుతో క్రీడించి.

ఇదంతా రంతుగా కనిపించవచ్చు, అలాగ్గా చూస్తే. లైంగిక వాంఛ స్త్రీకి సర్వస్వం. పురుషుడికి జీవితంలో ఒక కోర్కె మాత్రమే. అందుకే స్త్రీకి శీలం అంత విలువయింది, పురుషుడు కొనడానికి ఎగబడతడం. ఆమెను శీలవతుల్లోంచి పతితల్లోకి అన్ని పరిస్థితుల్లో వివిధ రూపాల్లో నడిపించినవి పాపాలే. కాని ఎన్ని పాపాలు చేస్తున్నా, బ్రతుకు వూబిలో పడి ఎంతగా పెనుగులాడుతున్నా ఆమె ఎప్పుడూ అందులో కూరుకుపోలేదు. యిందుకు కారణాలు స్వార్థం లేని కరుణ, ఎదురు లేని అన్వేషణ, చలించని సాక్షీభావం. కాలు జారడానికి ప్రేరణ, తన రాఘవ యాతన చూడలేని కరుణ. లాడ్జి ఎక్కించింది. కన్న కొడుకు మృత్యువుతో పెనుగులాట చూడలేని కరుణ. సాని సంసారిగా బందగా బ్రతుకు యీడ్చింది కన్న బిడ్డలు కడుపునిండా తిని వొంటినిండా బట్ట కట్టుకుంటున్నారనే కరుణాజనితమైన తృప్తి. (అరుణగా) కాలుజారి బోల్తాపడ్డట్లు తెలుసుకున్నా బెండేలుపడకపోవడానికి, (సావిత్రిగా) లాడ్జిలో కూలిపోకుండా నిలబడ్డానికి, (అహల్యగా) అన్నీ తెంచుకుని. (నీలవేణిగా) రోడ్డెక్కడానికి ఆధారం, ఎదురులేని అన్వేషణ. ఎన్ని దెబ్బలు తిన్నా తాను తనుగా నిలదొక్కుకోవడానికి తోడ్పడింది ఆమెలోని సాక్షీభావం. వెర్రి ప్రేమలో వయినా, మాతృ ప్రేమ దాసిగా వున్నా, సాని సంసారిగామారినా, ఆరితేరినవేశ్యగా నాటకంనడిపినా, స్వతంత్రించి బ్రతికే చిరు వుద్యోగినిగా వున్నా ఆమెమనోవృత్తిని అంటకండా దూరంగా

ఆమెనుండి వేరుగావిలబడి పరిశీలిస్తున్న తత్వం ఆమెలో కనిపిస్తుంది. ఒక స్థితికి లోబడి పోయి, బందబారి ఆ స్థితిలో యిరుక్కుపోయే సమయానికి లోపలినుండి మనస్సు పొరల్ని చీల్చుకుని, అవరించిన నిస్సహాయతని ఛేదించి వచ్చే యీ పరిశీలనాతత్త్వ కాంతిపుంజం ఆమెను మేల్కొలిపి యింకోస్థితికి చేర్చుతుంది.

మొదటి రెండు కథల్లో కరుణ ప్రధాన ప్రేరక శక్తి. సాక్షి భావం కరుణ మరుగున లీలగా కనిపిస్తుంది. ఆదుణకు రాఘవ్‌తో లేచి రావడం కాలుజారడం అన్న స్పృహలేదు. రాఘవ్ కోసం పెద్దమనిషితో రమించినపుడు కాలుజారినట్లుగా నటించినా జారిం దనుకోలా. పేపర్‌లో రాఘవ్ పెండ్లి ఫోటో చూపినప్పుడు కాలు జారినట్లు సాక్షీభావం తెల్పుతుంది. సావిత్రి కరుణ, చూపు లతో తెలుస్తుంది. లాడ్జికెక్కించిన తెంపు యిచ్చింది సాక్షీభావం. పెడదార్ని పెరిగే పిల్లలు క్లాస్, కక్కుర్తి, వ్యసనాలు పెరిగిన మగడు, సంసారం పడవటానికి వొళ్ళప్పగించి, నలిగి మగత జ్వరంలో చీరకప్పుకుని పడుండి వారించినా మీద చోటు చేసుకున్న మగడ్ని లాగి తన్ని తెగించి రోడ్డెక్కినపుడు అహల్యలో కరుణ అడుగంటి సాక్షీభావం పైచేయయింది. మీది ముసుగు మగడు తీయడం చాలా బలమైన వాక్ సంకేతం (symbol). యిది ఆమెను కప్పిన తెర తొలిగించటం.

"చీరజరిపి ఆమె మీద చాటు చేసుకుంటాను" అనే బలమైన వాక్యాన్ని "ఆమె దగ్గరకి చేరుకుంటాను"గా మార్చడం, మన తెలు గులో కొందరు పాత్రికేయులకే తెలిసిన అశ్లీల నివారణ!

యీ వాక్యం "నిప్పుపుండు"లో టిక్కు.... టిక్కు.... మీట.... మీట.... నొక్కు.... నొక్కు...." అంత బలమైన వాక్

సంకేత రూపం (Symbolic representation) యిటువంటి వాక్యాలు మార్చటం వెన్ను విరవడం. నీలవేణిలో కరుణ కాఫీ కలిపివ్వడంలో కనిపిస్తుంది. సమయం దొరకగానే కాచేసి భగ్నం చేసిన యువకుడి పెరపెర కళ్ళల్లో మసలే వాక్ ప్రతీకలో (image) చూపించారు శ్రీ చండీదాస్. "ఆమె కాలు తగిలి కప్పు విరిగిపడి రెండో కప్పుకి తగిలి- రెండు కప్పులూ నేల మీద దొర్లాయి"- యిది చెరచడం మీద చక్కని కనువిప్పు కలిగించే వాక్ప్రతీక.

"హిమజ్వాలలో పెంచకుండా తుంచేసి వుంచితే లీలగా వుండి పోయినలీల," యీ నాలుగు స్థితుల్లోనుండి పెరిగి 'విప్పువుందు'లోంచి ద్విగుణీకృత మవుతుంది. తను కన్న ముద్దుల కృష్ణమోహన్‌తో క్రీడించినట్లు నిలదీసి నిరూపించిన పుట్టుమచ్చ హృదయంలో విప్పు పుండవుతుంది.

"టిక్కు.... మీట.... నొక్కు...." యాంత్రిక ట్రిక్కులు పనిచేయవు. యిదంతా ఎందుకు చేసినట్లు? గెలుపులోని వోటమి కప్పి పుచ్చేందుకు ఆడిన నాటకమంతా వోటమి గెలవటానికి పనికిరాలా. దీనికి అర్థం, ధ్యేయం గమ్యం ఏమిటి? వాంఛల తుఫాన్ విచ్ఛిన్న మయింది; తృష్ణ అంతరించింది, పెళపెళ మరిగే కపి గెలుపులో వోటమిలా నర నరంలో ప్రవహించి కన్నకడుపు కోతగా కూల్చింది, అన్వేషణ శూన్యం చూపింది. పూర్తిగా జీవితం తెలిస్తేనే శూన్యత దర్శితమవుతుంది. శూన్యం తెలియందే జీవితం తెలియదు. దీని వెల మనిషి సర్వస్వం. యీ స్థితిలో- చెప్పవలసింది, చెప్పే అవసరం, మార్గం, భాష లేవు. యిది మునిగి చూడవలసిన లోతు. అంచేత మౌనం. శూన్యాన్నీ మౌనాన్నీ తెలుగులో అనుభూతిలోకి సాహిత్యం ద్వారా తెచ్చింది చండీదాసే.

యీ స్థితిలో వేదన బోధన రోదనలకి చోటు లేదు. యీ నిర్వాణ విషాదానికి జ్వలించిన అశ్రువులు బేలగా స్రవించవు. శూన్య దర్శన స్పర్శతో ఘనీభవించి, దెబ్బతిన్న దంతం క్రింద మంచు

ముక్కలా హృదయాన్ని కొరుకుతాయి. తను ఆడది, తల్లి అనే వునికి నిరూపించుకోవటానికి. Camns. Cross purpose కొడుకని తెలియక అందర్నీ చంపినట్లు చంపేసిన తల్లిలా, తనువు చాలించడమే మార్గం.

రచయిత సృష్టికర్తగా చేసేది సంఘటనల్నీ అందులో యిమిడే పాత్రల్ని సృజించడం, వీటి వెనక ప్రేరకమైన సృష్ట్యనుభూతిని పాఠకుడు ప్రత్యనుభూతించేలా దృష్టి కోణాన్ని (point of view) ఏర్పరచడం. యీ మూటిటి కూర్పు వైచిత్రినే శిల్పం అంటారు. చండీదాస్ శిల్పం సజీవమైనది. అందుకనే వీరి రచన, మేధారూపంగా అర్థం కాకముందే, హత్తుకు పోతుంది, కదిలిస్తుంది.

కాలు జారింది కథ చెప్పింది అరుణ. కథ, నాయికతో చెప్పించడం వల్ల ఆమె కళ్ళు తెరవడం, వీటి చక్రం తెలుసుకోవడం, వివిధ దశల్లో చూపించడానికి వీలయింది. రాఘవ్‌తో లేచి రావడం అరుణకు కాలుజారడం అని సంఘం అంటుందనే స్పృహే లేదు. రాఘవ్, తను దరిద్రం నుండి బయట పడ్డానికి కాలు జారినట్లు నటించి, జుగుప్స దిగమింగి, కాశీపతిని రంజింప జేయటం కాలుజారడ మనుకోలా. కాశీపతి కూతురుతో తన రాఘవ్ పెళ్ళి ఫోటో కళ్ళు తెరిపిస్తుంది. యిందులో చప్టామీద కాలుజారినట్లు అరుణ నటించడం చాల శక్తివంతమైన నాటకీయ వ్యంగ్యం (dramatic irony)

సావిత్రి కథ చెప్పింది రచయిత. యీ ఎత్తుగడ- సావిత్రి గాభరా, బెంబేలు పడడం, తల్లిగా తల్లడిల్లడం చిత్రించడానికి బాగా వుపయోగించింది. కానీ, రిక్షావాలా- సావిత్రి మొగుడు సంభాషణ ఎంత సహజంగా నడిచినా కథలో సజీవ భాగం కాలేదు. యిక్కడ శిల్పం దెబ్బతింది.

అహల్య భర్త సుబ్బారావ్‌తో చిలుందమ్మ సంఘంలో ఆమె కథ చెప్పించడం శిల్పం సజీవం చేయడం. గృహిణిగా ఆమె సహనం, వెడినా సరిపుచ్చుకొన్న ఆమె మాతృత్వం, రక్కిన తాళ్ళి కట్టుబాటు తెంపుకుని విజృంభించడం, ఆమెను నరకయాతన పెట్టిన సుబ్బారావ్ చిత్రించడం వల్ల ఒక విలక్షణ శక్తి పాత్రకు చేకూరింది. నీలవేణి అందం ఆకర్షణ, కవ్వించే కంఠ మెరుగూ, ఆమెను అవకాశం దొరకడం తడవుగా చెరిచిన నకిలీ విప్లవాదర్శ ధోరణిలో పేలే నవ్వా యువకుడు వివరించడం మంచి ఎత్తుగడ.

లీలే చివరికి తన కథ చెప్పడం వల్ల ఆమె అంతరంగ తరంగాలు చూడడానికి వీలయింది. లీల జీవితంలో ముఖ్యంగా మూడు అంతర్ జీవితాలు కనిపిస్తాయి. తన అందం వెలుగుకో ఘరానా మనుష్యుల్ని పురుగుల్లా లాగి పిప్పి పిప్పి చేస్తూ ఆనందించే తత్వం. తనగుండా తాను తనని దాటి "నేను నేను కాదు, నేను కానిది నేను" అనే దార్శనిక వెలుగులో తననిజస్థితికి విముక్తి చూపే సాహిత్యశరణాలయంలో ఏకాంత అన్వేషణ. తన భావరాగాలు పూర్తిగా అదుపులో పెట్టి, తనని తాను చంపుకుని, తను ఎంత యాంత్రికంగా మారినా తనలో దాగని సహజకరుణతో ప్రాణం లోతుల్లో పోరాడే ఆదర్శనారీయా మూడు అంతర్ జీవితాలూ ముప్పేరిని వేధించేది తన నెత్తురులో నెత్తురు తన కండలో కండ అయినా, మొరటుగా వున్నా మగతనం పుట్టినదే కృష్ణ విషయంలో. Oedupus complexని తల్లక్రిందులు చేసే విషాద ఘట్టం యిది. లీల క్రిష్ణ, తల్లీకొడుకూ అని ధ్వనించే నాటకీయ వ్యంగ్యం (dramatic irony) వీరి సంభాషణలో చాల హృదయ సంచలనం కలిగించేలా నడిచింది. అరుదుగా తను ప్రారంభించిన తన కథ లీలగా తను ముగించడంతో మొత్తం యితివృత్తానికి మంచి బిగి చేకూరింది. ఒకమనిషిని యింకొకరు ఇరుకులో పెట్టవచ్చు, హింసించవచ్చు, ఈ సంఘం ఓటమి-గెలుపుల చదరంగంలో చిత్తుగా ఓడించవచ్చు. కాని, పూర్తిగా నాశనం ఎవరూ చేయలేరు. తను నాశనం కాకుండా ఇతరు అందరినీ నాశనం చేయడం జరగదు. కాశీపతి తనని ఓడించినా సర్వనాశనం చేయ

లేదు అన్న అరుణ ధైర్యం తను పతనం కాకుండా యితరుల్ని పతనం చేయడం జరగదు అని లీల గ్రహించిన విషాద వక్రోక్తి (tragic irony) గా మారడం 'చీకట్లోంచి చీకట్లోకి' కళాత్మకమైన సమగ్రత చేకూర్చింది.

చండీదాస్ పాత్రలు ప్రాణమున్న మనుషులు, మాటలచిత్రాలు కాదు. పాత్రలుమాట్లాడేదిసజీవభాష. ప్రతివాక్యం అనుభూతికి అక్షర రూపంసజీవమైన శైలి. ప్రాణమున్న భాష. వాక్యం నడకలో భావం ఊపిరి వినిపిస్తుంది. "నాకు జ్వరంలేదు రోగంలేదు రొప్పులేదు విచారంలేదు ఆకలి లేదు ఆవేదన లేదు ఆరోగ్యం లేదు ఆనందం లేదు కోపం లేదు కరుణ లేదు కాఠిన్యం లేదు దీనత్వం లేదు బాధ లేదు సుఖంలేదు మనసులేదు వొళ్ళు లేదు చీమూ నెత్తురు లేదు సిగ్గూ శరమూ లేదు నీతి నియమమూ లేదు మొగుడు లేదు పిల్లల్లేరు.... ఎవర్రా లంజః....నిన్ను కుక్కా అని పిలిస్తే విన్న కుక్క విలువునా కుంచించుకు పోతుందిరా—లోఫర్ లోఫర్— నువ్వే- నువ్వే- నువ్వు లంజడివిరా కుక్కా పందీ దుంచూ ఎలకా నక్కా పురుగా కమ్మరి పురుగా పేడపురుగా మొట్టుబట్టా" వ్యాకరణ సూత్రాల్ని విరామ చిహ్న నియమాల్ని అధిగమించిన ఈ వాక్యం అహల్యకు "లేదు" అన్న తెంపరితనం, మాటలు అన్న తీరు, వేగం, కచ్చి, కరుకు, గొంతు జీర,-ఇవన్నీ చదివినప్పుడు మెదడులో నాలికి విని పిస్తాయి. హింస భరించే హృదయానికి పొలుసు దెబ్బలాంటి ఘాతం తగిలితే ప్రళయంలా పగలగొట్టుకు వచ్చే జలలాంటి స్వేచ్ఛ చూతే ఈ వాక్యం, 'లంజడివిరా' అనే మాట-భాష, పలుకుబడి నుడికారం, పెంచడం. మొత్తం వాక్యం అంతా జీవంతో స్పందించే ఒకే ఊపిరి వున్న మాట. తుంచితే నెత్తురు కారుతుంది.

గంభీర భావాల్ని ధ్వనించే ఒపుడు వాక్యం లోకూర్పు ('deep structure')లో, హృదయాంతర్గత భావ స్పందన ఊహా సంచలనం వినిస్తాయి.

"అసలు లీలని నేను కాదు. నేనసలు లీలని కాదు."

''Once upon a time...avoids locating in a spatio-temporal frame'' నేటి నిత్యజీవిత అనుభూతిలో పుట్టిన ఈ నూతన ప్రక్రియ.

అనుభూతి భాష రూపంలో వాక్యంగా జనించడంలో అసలు సాహిత్య సృష్టి రహస్యం దాగివుంది. యిది వివరించి తర్క రూపంలో మేధపరంగా చెప్పడం భాషకందని విషయం. యిటు వంటప్పుడు వాక్యంలో అనేక వాక్యాలు సంలీనంచేసి ఒకే వాక్యంగా బహిర్గతం చేయడం మనకు కనిపించే రచనా ప్రక్రియ. దీన్ని Chomsky అనే భాషాతత్త్వవేత్త లోకూర్పు 'deep structure' అని వివరించారు తన Transformation generative grammar సిద్ధాంతంలో.

ఈ వాక్యంలో వైరుధ్య భావాల వాక్యాలను సంధానం చేసి కలిపి—

1) వెలుగు చుట్టూ పురుగుల్లా ఘరానా వ్యక్తుల్ని తిప్పే లీల (అందరికీ తెలిసిన లీల) 2) లీలకే తెలిసిన లీల (అసలు లీల) 3) తన సహజ శక్తుల్నీ వాంఛల్నీ అదుపులో పెట్టి యాంత్రికంగా మారిన లీల.

నేను లీలను

మామూలు భౌతిక లీల — లీల 1

|

నేను మీకు కనిపించే లీలనే — లీల 3

అంటే, |

అసలు లీలను నేను కాదు + 2 మీకు తెలియదు.

నేను మీకు కనిపించే భౌతిక లీలని 1

|

నేను అసలు లీల ("జగల్లీలః")ని కాదు-

మీకు తెలిసిన 1+3 లీల నేను కాదు.

అంటే: అసలు లీల లీలే.

యిందులో వాక్యం- అక్షరం కూడా కదల్చటానికి వీలులేదు. ఏ మాత్రం మాట అక్షరం, మార్చినా- కదిల్చినా- పూవు తుంచిన మొక్కలా వాక్యం వాసిపోతుంది.

మెలికలు తిప్పే వ్యభిచారి కామం వొత్తిడిని వాక్యం కదలికలో చూపించడం: "వొత్తుగా కండా, గుండ్రటి వొంపులు- వాటి కూడా నేను లోపలికి వెళ్ళాను" అనే వాక్యం.

ఛలోక్తిగా పాత్ర అన్న మాటలో కూడా కదిలించే విషాద ఛాయ స్ఫురిస్తుంది. "చెయ్యిమారిన అడదీ, చల్లారిన కాఫీ, పనికి రావంటారు", "చిత్తకార్తి కన్య" అనే మాట. జాతీయత ఏమాత్రం చెడకుండా సృష్టించిన కొత్త పదం. వుపమానాల్లో నూతనత్వం ఏపుదనం కనిపిస్తాయి. "గూటి దగ్గర పిగిలిన బ్లౌజు లోపల-తినే అర్ధాకలి తిండీ మరే అవయవానికీ దక్కకుండా గుంజేసినట్లుగా అనిపించే గుండ్రటి స్తనాలు; తేరగా వొస్తే తిని బలిసిన అణపడు చల్లా వున్నాయి."

లోపల వూపిరాడకుండా గుండెను పిండే భరింపరాని ఓరీక్షణని చూపులో చూపించడం ఈ వాక్యం: "చూడనట్లుగా చూసి, చూసినట్లుగా చూడకుండా, లోపలికి వెళ్ళింది. మళ్ళీ వొచ్చింది.

మళ్ళీ వెళ్ళింది. మళ్ళీ వొచ్చి మళ్ళీ వెళ్ళింది. కళ్ళు, చూసింది—యిందులో ప్రతి విరామ చిహ్నం పాత్ర భావగతిని ప్రతిబింబిస్తుంది. ఈ వాక్యం అనుభూతిలో మొలకెత్తింది.

మనోగతమైన వివిధ భావఛాయలు, ఎండపొరల్లా వచ్చే పోయే ఆలోచనల తెరలు, వ్యూహాల సంచలనం, వీటి సంఘర్షణ, చండీదాస్‌గారి మాటల పేర్పింపు, వాక్యం కూర్పు, ధ్వనింప జేస్తాయి:

"వాడి మూతి మీద పెదవులు ఆన్చాను. చీమి కురుపు మీద మూతి అనినట్లు; నాలికతో ఆ రసి నాకినట్లు....

"అబ్బా—యింత భయంకరమని తెలిస్తే యిందుకు సాహసించకనే పోదును.

"ఐనా, అధరాలు పిండి, గుండెల్ని పొంగించి....అమృతం బొట్లు రాల్చాను.

........................

"అందుకు పర్యవసానంగా, నా మనసున చిందిన నెత్తుటి బొట్లు, గుండెలో గడ్డకట్టి నల్లరాళ్ళలా గుప్తంగా నిలిచిపోయాయి."

దార్శనిక గంభీరమైన కొన్ని భాషకందని అనుభూతుల్ని భిన్న పదాల్ని విరిచి వాక్యం మెలితిప్పి పదాల అమరిక ద్వారా అనుభవైక వేద్యం అయిన విషయాన్ని అనుభూతిలోకి తీసుకొస్తారు చండీదాస్.

"గెలుపులోని ఓటమి నరనరంలో ప్రవహించగా-ఓటమిని గెలవక పోయిన నేను-సాహిత్య శరణాలయంలో శిరం దాచుకుని-

"నిజంగా వాక్కావల్సింది, దొరకనిది. దొరికింది అక్కర లేనిది...."

యిది భావాన్ని వాక్యంతో మాటల మేళవింపుతో సంలీనం చేసి సజీవ (స+హిత్యం) సాహిత్యం చేయడం. భావాన్ని వాక్యంలో యిరికించడం కాదు.

అనుభూతిలో మొలకెత్తి సహజ రూపం సంతరించుకున్న సాహిత్యం కనకనే చండీదాస్‌గారి రచన్లు పూర్తిగా మేధాపరంగా అర్థం కాక మునుపే పాఠకుని స్పృహకి హత్తుకుపోతాయి. ప్రాణమున్న భాష కాబట్టి భావం నెత్తుర్లో ధ్వనిస్తుంది.

[illegible]సెంబర్ 1977 —గుత్తికొండ నాగేశ్వరరావు